# గదర్ వీరులు

రచన

రన్‌ధిర్‌సింగ్

ప్రజాప్రచురణాలయం,
నారాయణగూడ, హైదరాబాదు (దక్కన్.)

# పరిచయం

జాతీయ చరిత్రలో ప్రజల మనస్సు న్నుర్రూతలూగించే ఒక ప్రధాన ఘట్టం—1914—18 గదర్ పార్టీవీరుల ఉజ్వలపోరాటగాథ — ఈ చిన్ని పుస్తకంలో సంక్షిప్తంగా చిత్రించబడింది. మృత్యుదేవతయొక్క వికటాట్టహాసానికి కూడా జంకని గదర్‌యోధుల అపూర్వ ధైర్యసాహసాలు, అసమాన కార్యదక్షత, అచంచల త్యాగదీక్ష, వారి కష్టసహిష్ణుత ఆనాడు ఆసేతు హిమాచలం ఊపివేశాయి. ఆ విప్లవమూర్తుల ముప్పది సంవత్సరాల కృషిఫలితమే గదర్ పార్టీచరిత్ర.

భారత చరిత్రలోని ఈమహత్తర అధ్యాయం నేటి సాధారణ రాజకీయ వేత్తలకు మరచిపోయిన ఒక స్వప్నకథలాగా కనిపిస్తుంది. గదర్‌పార్టీని గురించి, కామగటామారూను గురించి, 1914—18 మధ్య పంజాబ్‌లో జరిగిన అసంఖ్యాకమైన హత్యల్ని గురించి, కాల్పుల్ని గురించి ఒక అస్పష్టమయిన భావన మాత్రమే మిగిలిపోయింది.

గదర్ ఉద్యమానికి ప్రముఖ నాయకుడూ, గదర్‌పార్టీ నిర్మాత అయిన బాబాసోహనసింగ్‌భాక్నా యొక్క స్వానుభవాన్ని పురస్కరించుకొని మొదటి సారిగా గదర్ పార్టీచరిత్ర ఇతిహాసరూపంలో వ్రాయబడింది. మన ప్రధాన జాతీయనాయకులు 'హోమ్‌రూల్' తోనే సంతృప్తి పడుతూ ఉన్న ఆరోజుల్లో మామూలు రైతుబిడ్డలు విప్లవ జెండాకింద తిరుగుబాటు లేవదీసి ఏవిధంగా బ్రిటిష్ సింహాన్ని గజగజలాడించారో, ఆ విప్లవమూర్తులు దేశానికి ఏసందేశం ఇచ్చి ఉరికంబాలెక్కారో, ఎటువంటి దారుణమయిన చిత్రవధలకు గురి అయ్యారో, అండమాన్ దీవుల్లో ఉండికూడా ఎంతనిర్భయంగా ప్రభుత్వాన్ని ఎదిరించి పోరాడారో, ఈనాడు వారు చేస్తూఉన్న కార్యక్రమమేమిటో, ఈపుస్తకంతెలియచేస్తుంది.

గదర్ ఉద్యమం ఒక సామాన్య టెర్రరిస్ట్ ( బాంబువాదం ) ఉద్యమం లాంటిదికాదు. ప్రప్రథమంగా ఈ ఉద్యమానికి పునాది మనదేశంలో కాకుండా అమెరికాలో వేయబడింది. ఈపార్టీ నిర్మాతలు మధ్యతరగతికి చెందిన

మంది యువకులుకాదు, పంజాబు రైతులు. ముఖ్యంగా సిక్కులు. ఉదర పోషణకోసం వారు అమెరికావెళ్ళి వ్యవసాయ కూలీలుగా, ఫ్యాక్టరీ కార్మికులుగా పనిజేశారు. భారతదేశాన్నుంచి వెళ్ళేటప్పుడు వారికి రాజకీయాలతో ఎటువంటి ప్రసక్తిలేదు. బానిసత్వం ఎంత హేయం అయిందో, బానిసజాతి ఎన్ని అవమానాలకు గురికావలసి వస్తుందో, వారు కండ్లారా చూశారు. స్వయంగా అనుభవించారు. ఈదుర్భర అవమానాల ఫలితంగానే వారి హృదయాల్లో ఒక నూతన స్ఫూర్తి రేకెత్తింది. ఒక నూతన చైతన్యం కలిగింది. ఈ జాగృతి ఫలితమే గదర్ ఉద్యమం. మాతృభూమికి తిరిగివెళ్ళి తమ బానిసత్వానికి మూలకారణం అయిన బ్రిటిష్ ప్రభుత్వాన్ని సాయుధ పోరాటంతో ప్రతిఘటించి ఓడించాలని నిశ్చయించుకున్నారు. ఇందుకు అవసరమయిన ఆయుధాల్ని సేకరించారు. డబ్బు పోగుజేశారు. అనేకమంది పార్టీ ప్రముఖులు తమకున్న సర్వస్వం అర్పించివేశారు. సైనిక శిక్షణకు కావాలసిన ప్రయత్నాలన్నీ పూర్తిచేశారు. పార్టీసభ్యత్వం 12 వేలవరకు పెరిగింది.

1914 లో ప్రారంభమైన ప్రధమ ప్రపంచ మహాయుద్ధమే తమకు మంచి అవకాశమనుకున్నారు. ప్రభుత్వాన్ని చావుదెబ్బ గొట్టడానికి అమెరికానుంచి ఇండియాకు దళాలవారీగా ప్రయాణమయ్యారు. రెండుసంవత్సరాల్లో మొత్తం 8 వేలమంది భారతదేశానికి చేరుకున్నారు. సాధారణ రైతుకుటుంబాల్లోనుంచి వచ్చినవారగుటచేతను, ఇదివరకు ఏ మాత్రం అనుభవం లేకపోవుటచేతను ముందుగా తగిన జాగ్రత్త తీసుకోలేకపొయ్యారు. తాము నిర్వహించవలసిన కర్తవ్యం ఎంతమహత్తరమయిందో సరియైన అంచనా వేయలేక పోయారు. ఇండియాలో అడుగుపెట్టిన వెంటనే వారిలో అనేకమందిని ప్రభుత్వం అరెస్టు జేసి బందిఖానాల్లో బంధించింది. షుమారు 2500 మందిని ఇంటర్న్ చేసింది. కానివందలకొలది గదర్ సభ్యులు ప్రభుత్వం పన్నిన ఉచ్చుల్లోనుంచి తప్పించుకోగలిగారు. అజ్ఞాతంగానే ఉండి అనేక ప్రదేశాల్లో యధావిధిగా తమ కార్యక్రమాన్ని కొనసాగించారు.

రాజకీయాలంటే ఆరోజుల్లో గవర్నమెంటుకు అర్జీలు, మహజర్లు పంపడమే అనుకునేవారు. పైవర్గాలకుచెందిన కొద్దిమంది భారతీయులు సంవత్స

రానికి ఒకసారి సమావేశం కావడంతో కాంగ్రెస్‌వాదులు తమకార్యక్రమాన్ని నెరవేర్చామని భావించేవారు. వీరిలో అనేకమంది నిజాయితీగల దేశభక్తులే అయినా ఆరోజుల్లో వీరు విప్లవం అనేమాటను ఊహించికూడావుండరు. ప్రజాసామాన్యం ఆనాటికింకా రాజకీయాల్లో ప్రవేశించనేలేదు. దేశమంతా నిస్తబ్ధంగా ఉండేది.

అమెరికానుంచి తిరిగివచ్చిన గదర్‌యోధులు ఆనాటి పరిస్థితుల్ని బట్టి సైన్యంలో తిరుగుబాటు తీసుకరావడం వల్లనే బ్రిటిషు ప్రభుత్వాన్ని నిర్మూలించ గలమని ఆశించారు. వాతావరణంకూడా అందుకు అనుకూలంగానేవుంది. సైనికులుకూడా తమలాగే రైతుబిడ్డలు. వారిలో అనేకమందికి బంధువులుకూడా. యూరోప్ ఏషియా ఖండాల్లో దూరంగాఎక్కడో జరుగుతూఉన్న యుద్ధానికి ఇక్కడి సైనికుల్ని ప్రభుత్వం పంపుతూవుంది. తమ మాతృభూమిని విడిచిపెట్టి ఎక్కడికో కానిదేశం వెళ్ళియుద్ధంజేసి చచ్చిపోవడమంటే సైనికులకు ఏమాత్రం ఇష్టంలేదు. సైన్యంలో నానాటికి అసంతృప్తిపెచ్చుపెరిగిపోతూఉంది. తెల్లవాళ్ళు భారతీయ సైనికుల్ని చాలానీచంగా జూస్తూ వుంటారు. ఆ అసంతృప్తికి ఈ అవమానంకూడా తోడై అగ్నిలో ఆజ్యంలాగా పనిజేసింది. గదర్ పార్టీసభ్యులు సైనికులతో గూడా దగ్గిరసంబంధం పెట్టుకున్నారు. తిరుగుబాటు చేయడానికి తాముకూడా సిద్ధంగానే ఉన్నామని అనేక మంది సైనికులు హామీ ఇచ్చారు.

కాని వేసుకున్న ప్లాను తల్లక్రిందులయింది. కొందరుజేసిన ద్రోహమే ఇందుకు ప్రధానకారణంగా పైకి కనపడినా అసలుమూలకారణం వేరేఉంది. ప్రజాఉద్యమంతో సంబంధంలేని వట్టిమిలటరీ తిరుగుబాటు ఎప్పటికి జయప్రదం కాజాలదు. అనేకమంది ఉరితీయబడ్డారు. వందలకొలదీ దీర్ఘశిక్షలకుగురయ్యారు. వేలకొలదిమంది ఇంటర్న్ చేయబడ్డారు. యావజ్జీవ శిక్షవిధింపబడిన వారిలో 20 సంవత్సరాల యువకులనుండి 60 సంవత్సరాల వృద్ధులుదాకా ఉన్నారు. అండమాన్‌దీవుల్లోను ఇండియాజైళ్ళలోనూవున్న భయంకరపరిస్థితుల్ని ఎదిరించి అనేక పోరాటాలునడిపారు. లాఠీలు, కొరడాలు, ఉపవాసాలు ఎటువంటి హింసాకాండకూడా వారి వజ్రసంకల్పాన్ని మార్చలేక పోయింది. బొందిలో ప్రాణం ఉన్నంతవరకుపోరాడి ఎనమండుగురుకామ్రేడ్స్ అండమానుల్లోనేచనిపోయ్యారు.

20 సంవత్సరాలకుపైగా ఈ వీరుల్ని జైళ్ళల్లోబెట్టి ప్రభుత్వం దారుణంగా హింసించింది. వారి శరీరాలు శిథిలమై పోయినా వారి హృదయాల్లో ప్రజ్వలిస్తూ ఉన్న ఆ విప్లవాగ్ని మాత్రం చల్లారలేదు.

జైలునుంచి విడుదలై బైటికి వచ్చిన తర్వాతకూడా వారు శాంతిని అపేక్షించలేదు. విశ్రాంతి తీసుకో దలుచుకోలేదు. ద్విగుణీకృతోత్సాహంతో మళ్ళీ కార్యరంగంలో దిగి తీవ్రంగా పనిచేయసాగారు. అనేక సంవత్సరాల పోరాట ఫలితంవల్లను అనేకమంది మిత్రులు తమ అమూల్యములయిన ప్రాణాల్ని సైతం కోల్పోయి సంపాదించిపెట్టిన అనుభవంవల్లను జాతీయ అంతర్జాతీయ రాజకీయ పరిస్థితుల్లో వచ్చిన మార్పులవల్లను, వెనకటి పద్ధతుల్నే అనుసరించి పనిచేయడంవల్ల స్వరాజ్యం రాదని గుర్తించారు. సమస్త ప్రజానీకాన్ని రాజకీయ రంగంలోకి తీసుకరావాలి. బలమయిన ప్రజాఉద్యమాన్ని నిర్మించాలి. అప్పుడే సైన్యాన్నికూడా మన ఆధీనంలోకి తెచ్చుకోగలం. అప్పుడే అంతిమ పోరాటాన్ని జయప్రదంగా సాగించి బ్రిటిష్ ప్రభుత్వాన్ని శాశ్వతంగా ఈ దేశాన్నుంచి సాగనంపగలం.

ఈ విప్లవ యోధులయిన వృద్ధమూర్తులందరు ప్రజలతో కలసి మెలసి వారి కష్టనష్టాల్లో పాల్గొని ముందుండి నడిపిస్తూ మహత్తరమయిన ప్రజా ఉద్యమ నిర్మాణానికి పూనుకున్నారు. వారితోపాటు వారి విప్లవ సత్సాంప్రదాయాలు, స్వార్థత్యాగ నిరతి, మొక్కవోని ధైర్యసాహసాలు ప్రజా ఉద్యమంలోకూడా ప్రవేశించాయి. స్వాతంత్ర్య పోరాటానికి ఒక కొత్త మెరుగు బెట్టాయి. కాంగ్రెస్ ఉద్యమంలోకూడా వీరు తీవ్రంగా కృషిచేశారు. వీరిలో అనేకమంది కాంగ్రెస్‌సంస్థలోని ప్రధాన పదవులకుకూడా ఎన్నుకోబడ్డారు. వయస్సులో తమకు పుత్రులుగా పౌత్రులుగాకూడా ఉండదగిన యువక వర్కర్లతో చేయిచేయీగలిపి పంజాబ్‌రాష్ట్రంలో బ్రహ్మాండమైన రైతు ఉద్యమాన్ని నిర్మించారు. బలవత్తరమయిన కమ్యూనిస్ట్ ఉద్యమానికికూడా తమ రాష్ట్రంలో పునాది వేయడానికి ప్రధానపాత్ర వహించి పనిజేశారు.

పట్టినపట్టు విడువకుండా కమ్యూనిస్ట్ సాహిత్యాన్ని క్షుణ్ణంగా చదివి అవగాహన చేసుకున్నారు. నవ్యభావభానూదయ గర్భితమయిన నవయుగ

ప్రభాతానికి సంతోష పూర్వకంగా స్వాగతంఇచ్చారు. 1914 లో స్వాతంత్ర్య పోరాటానికి ముందుండి వీరోచితంగా పోరాడారు. నేడు వయస్సులో వృద్ధులయినా యువకులకంటె ఎక్కువ ఉత్సాహంతో కమ్యూనిస్ట్ జెండాక్రింద అగ్రభాగమందుండి ఆదర్శంగా ముందుకు సాగుతూ ఉన్నారు.

ఒకవైపు ఉరికంబాన్ని కౌగిలించుకో బోతూకూడా "ఈ తుచ్ఛమయిన బ్రిటిష్ప్రభుత్వాన్ని దయాభిక్ష బెట్టమని నేను అడగను." అని గర్జించిన అమరజీవి కర్తార్సింగ్ సహచరులయిన గదర్ విప్లవకారులందరు నేడు పార్టీలోజేరి పనిజేస్తూఉన్నారు.

బాబాసోహన్సింగ్భాక్నా.బాబా కేసర్సింగ్. బాబాదూర్సింగ్, గురుముఖ్ సింగ్. పృధ్వీసింగ్ మొదలయిన మోహాను యోధుల్నిగురించి సవిస్తారంగా వ్రాయాలంటే ఒక్కొక్కరి చరిత్రే ఒక భారతం అవుతుంది. పంజాబ్ రైతు కుటుంబాల్లో వీరిని ఏ విధంగా దివ్యపురుషుల్లాగా భావించి పూజిస్తూఉంటారో స్వయంగా కండ్లారా చూస్తేనేకాని చెప్పితే నమ్మరు.

1914 లో ఈ విప్లవయోధులు భారతదేశానికి తిరిగివచ్చిన నాటికి నేటికి దేశపరిస్థితులు విపరీతంగా మారిపోయ్యాయి. బలవత్తరమయిన జాతీయోద్యమం నిర్మించబడింది. ఏ విప్లవాగ్నిని రగుల్కొల్పడానికై ఈ వీరులు తమ రక్తం ధారవోశారో నేడా విప్లవాగ్ని ప్రతి పల్లె పల్లెకు మూలమూలకు వ్యాపించి దేదీప్యమానంగా ప్రకాశిస్తూఉంది. సామ్రాజ్యవాదానికి శాశ్వతంగా స్వస్తిజెప్పే సమయం వచ్చింది.

తమ జీవితసర్వస్వం అర్పించి బ్రిటిష్ప్రభుత్వంతో హోరాహోరి పోరాడిన ఈ వీరాగ్రేసరుల ఉజ్వలచరిత్ర నేటి విషమపరిస్థితుల్లో దేశంలో ఒక నూతన స్ఫూర్తిని రేకెత్తిస్తుంది. ఒక నూతన చైతన్యాన్ని కలిగిస్తుంది. స్వాతంత్ర్య పోరాటానికి ఐక్యబలాన్ని చేకూర్చి దేశాన్ని ముందుకు- ఇంకా ముమ్ముందుకు తీసుక పోతుంది.

24-12-45 — అజయఘోష్

# ఉదరపోషణకోసం

వ్యవసాయం అంతా ఛిన్నాభిన్నమైపోయింది. తమకున్న కొద్దిపాటి పొలాన్ని సేద్యంజేసి దానిమీద వచ్చే స్వల్పాదాయంతో సిక్కురైతులు కుటుంబాల్ని పోషించుకోలేక పొయ్యారు. ఇతరదేశాలకు వెళ్ళి ఏదోవిధంగా కూలీనాలీ చేసుకొని బ్రతుకుదాం అనే గంపెడాసతో పుట్టిపెరిగిన గడ్డ వదలిపెట్టి గత్యంతరంలేక విదేశాలకు ప్రయాణమయ్యారు. ఇది 19వ శతాబ్దంలోని చివరదశలోను 20 వ శతాబ్దంలోని మొదటిదశలోను జరిగిన విషయం.

రత్నగర్భ అయిన మనమాతృభూమి 150 సంవత్సరాల సామ్రాజ్యవాద పరిపాలన ఫలితంగా కరువు కాటకాల కాటపట్టయింది. ఆర్థికసౌష్టవం సన్నగిల్లింది. చేతి పనులు దెబ్బతిన్నాయి. అందరికి వ్యవసాయం ఒక్కటే జీవనోపాధి అయింది. భూమి అంతా చిన్నచిన్న ముక్కలుగా విభజింప బడింది. ఇక్ష్వాకులనాటి పాతపద్ధతులేకాని వ్యవసాయంలో చెప్పుకోదగ్గ కొత్తమార్పులేమీ రాలేదు. రైతుల పరిస్థితి నానాటికి విషమించింది. ఋణభారంతో కుంగిపొయ్యే రైతులమీద మూలిగేనక్కమీదతాటిపండులాగా శిస్తుభారంకూడా అధికంగాపడింది. అప్పటికింకా కొద్దీగొప్ప మిగిలిఉన్న రైతుల జీవితాశను కరువు కాటకాలు మొదలంట తుడిచివేశాయి. రానురాను వ్యవసాయం చివరకొక జూదంగా మారింది. రేయింబవళ్ళు రెక్కలు విరుచుకున్నా పొట్టగడుస్తుందీ. అనే గ్యారంటీ లేదు.

ఎక్కడికయినావెళ్ళి ఏదోవిధంగా పొట్టబోసుకుందాం అనే ఆశతో మంచి ధైర్యసాహసాలు కలిగిన కొందరు సిక్కురైతులు మూటాముల్లె గట్టి విదేశాలకు ప్రయాణం అయ్యారు. వేలకొలదిసిక్కురైతులు తమ పొలాల్ని తాకట్టు బెట్టారు. పశువుల్ని వ్యవసాయ పనిముట్లను అమ్మివేశారు. పుట్టినంతవరకు అప్పూసప్పూజేసి కావాలసిన ప్రయాణఖర్చులు సమకూర్చుకున్నారు. కన్నీటి బిందువులతో పుట్టిపెరిగినగడ్డ నెడబాసి విదేశాలకు పయనమయ్యారు.

క్రమంగా బర్మా మలయా సింగపూర్, హాంగ్‌కాంగ్, షాంగ్‌హైలకు, చైనాలోని మరికొన్ని ప్రదేశాలకు అక్కడనుంచి ఆస్ట్రేలియాకుకూడా వెళ్ళారు.

వీరిలో బలిష్ఠంగా ఉన్న కొందరు ఆయా ప్రభుత్వాల్లో పోలీసులుగా జేరారు. మరి కొందరు చౌకీదార్లుగా ఉండి ఏదో విధంగా పొట్టపోసుకోడానికి అంగీకరించారు. మిగతావారు వర్తకులుగా కంట్రాక్టర్లుగా ఉండి ఇంటి దగ్గిర ఉన్నప్పటికంటే ఎక్కువడబ్బు సంపాదించ గలిగారు. కాని ఆయాదేశాల్లోని ప్రజలు ఈ వర్తకుల్ని కంట్రాక్టర్లనీ తమ దేశాన్ని దోపిడి చేస్తున్నారని అసహ్యించుకునే వాళ్లు.

అమెరికాలో ఎక్కువజీతాలిస్తున్నారనీ, జీవితాన్ని సౌఖ్యప్రదంగా గడపడానికి అక్కడ ఎక్కువ అవకాశాలున్నాయనీ ఈ సిక్కు రైతులకు తెలిసింది. ఇంతకు పూర్వమే అమెరికాకువెళ్ళిన వీరిబంధువులు స్నేహితులు ఉత్తరాల ద్వారా ఈ విషయాన్నే ఇంకాస్పష్టంగా తెలియజేశారు. అంతటితో ఈ రైతు ప్రవాహం తూర్పుగా ఇంకా ముందుకు సాగింది. మొదటి ప్రపంచ యుద్ధ సమయానికి అమెరికాలోగాని కెనడాలోగాని మొత్తం 15 వేలకు పైగా భారతీయులు ఉండేవారు. వీరిలో అధిక సంఖ్యాకులు పంజాబీ సిక్కులే.

## నికృష్టమైన బానిసజీవితం

అమెరికాలో ఉన్న పెద్దపెద్ద భూస్వాములు ఫ్యాక్టరీ యజమానులు ఇచ్చే కూలితో ఈ భారతీయ కార్మికులకు బాగానే సంతృప్తి కలిగింది. రోజుకు రూ 6-0-0 నుంచి రూ. 9-0-0 వరకు గిట్టుబాటయ్యేది. అయినా అమెరికా కార్మికులతో పోల్చిచూస్తే వీరికి ఇచ్చేకూలి స్వల్పమే. అమెరికా కూలీలకంటే వీరు ఎక్కువగా కష్టపడి బండచాకిరీ జేసేవాళ్ళు. వీరి జీవితావసరాలుకూడా చాలా తక్కువగా ఉండేయి. ఈ పోటీమూలకంగా అమెరికా కార్మికులకి భారతీయ కార్మికులకిమధ్య వైరుధ్యం ఏర్పడటం తప్పనిసరి అవుతుంది. కానిఎటువంటి ఆర్థికసంక్షోభంలేని ఆ రోజుల్లో ఈ వైరుధ్యం అంతగా బయటపడలేదు.

తర్వాత కొద్దికాలానికే (1907) అమెరికాదేశం తీవ్రమయిన ఆర్థిక సంక్షోభానికి గురిఅయింది. అనేకమందిని పనిలోనుంచి తొలగించారు. జీతాల్లో కోతగోశారు. కాని అమెరికన్ కార్మికులు బలమయిన తమ ట్రేడుయూనియన్ ఉద్యమం ద్వారా ఈప్రమాదాన్ని ధైర్యంగా ఎదుర్కొన్నారు. పెద్ద పెద్ద

సమ్మెలు చేశారు. సమ్మెలు చేసినవారిస్థానంలో చౌకగావచ్చే భారతీయ కార్మికుల్ని నియోగించి అమెరికన్ పెట్టుబడిదార్లు కార్మికోద్యమాన్ని దెబ్బగొట్టగలిగారు. డబ్బు సంపాదించటమే ప్రధానాశయంగా పెట్టుకున్న భారతీయ కార్మికులు అమెరికన్ పెట్టుబడిదారుల చేతుల్లో కీలుబొమ్మలై పోయ్యారు. టాకోమా (ఆరెగాన్) వద్ద జరిగిన రైల్వేసమ్మెను భారతీయ కార్మికులే భగ్నం చేసినందువల్ల వీరిమీద అమెరికన్ కూలీలకు తీవ్రమైన ద్వేషం కలిగింది. భారతీయవ్యతిరేకత విపరీతంగా వ్యాపించింది. ఈఅసంతృప్తే చివరకు రౌడీజానికికూడా దారితీసింది. భారతీయులుండే ఏలియమ్, ఎవర్ట్ సెయింట్ జాన్, టాకోమా మొదలయిన ప్రదేశాల్లో దాడిజరిగింది లూటీలు జరిగాయి. అమెరికన్లు భారతీయుల్ని బలాత్కారంగా లారీల్లో పడదోసి ఊరికి దూరంగా తీసుకపోయి వదిలిపెట్టేవాళ్ళు. పోలీసులకు ముందే హెచ్చరిక ఇచ్చి ఉండడంవల్ల ఇదంతా చూస్తూకూడా వాళ్ళు చూడనట్లే నటించేవాళ్ళు.

ఈ సంక్షోభంపోయి మళ్ళీకొన్నాళ్ళకు దేశం సుభిక్షంగా తయారయింది. ఆర్థికమాంద్యంతోపాటు రౌడీయిజంకూడా తగ్గింది. కాని భారతీయ వ్యతిరేక ప్రచారం మాత్రం ముమ్మరంగా సాగుతూనేఉంది. అమెరికనులకోపానికి ఒక్క భారతీయులేకాకుండా విదేశీయులందరూ గురిఅయ్యారు. కాని ఇతరదేశాలన్నీ స్వతంత్ర దేశాలవ్వడంచేత తమ ప్రజల హక్కుల్ని కాపాడుకోగలిగాయి. ఒకసారి జపాన్ దేశీయులమీదకూడా అమెరికన్లు దాడిచేసి కొంతనష్టం కలిగించారు. జపాన్ ప్రభుత్వం వెంటనే జోక్యం కలిగించుకొని తమ ప్రజలు నష్టపడిన ఒక్కొక్క డాలరుకి పదిడాలర్ల చొప్పున నష్టపరిహారం ఇచ్చింది. కాని భారతీయుల తరపున బ్రిటిష్ అధికార్లు జోక్యం కలిగించుకో నిరాకరించారు. దాని సత్యం అంటే ఏమిటో భారతీయులు ఈ స్వానుభవంవల్ల పూర్తిగా గ్రహించ గలిగారు.

కాలిఫోర్నియా, ఆరెగాన్, వాషింగ్టన్ ప్రాంతాల్లో భారతీయులు ఎక్కువగా ఉంటూ ఉండేవారు. 'బంగాళాదుంపల ప్రభువు' అని పేరుపొందిన జ్వాలాసింగ్ లాంటివారు, అతని భాగస్వాములయిన వాసఖాసింగ్ సంతోఖ్‌సింగ్ సోహన్‌సింగ్ భాక్నా కేసర్‌సింగ్ కాన్షీరామ్ ప్రభృతులు పూర్తిగా డబ్బు సంపా





దిస్తూ ఉన్నారు. ఎంతడబ్బు సంపాదించినా వారిని బానిసలులాగానే అమెరికన్లు చూస్తూ ఉండేవారు. హోటళ్లు రైళ్ళు పార్కులు థియేటర్లు ఎక్కడకువెళ్ళినా ఏదో ఒక అవమానం జరుగుతూనే ఉండేది. "కుక్కలు * హిందువులు లోపకి రాగూడదు" అని గేటుబైటే నోటీసుబోర్డ్ కట్టేవాళ్లు సోహన్‌సింగ్‌భాక్నాతో పాటు ఒకే టేబుల్‌ముందు కూర్చోడానికి ఒక తెల్లవాడు అంగీకరించలేదు. "నీవు తుపాకిగుండుకు తప్ప ఉద్యోగానికి పనికిరావని" కేసర్‌సింగ్‌తో మరో తెల్లవాడన్నాడు. "మీ దేశపు జనాభాఎంత ?" అని భారతీయుల్ని ప్రతివాడూ వ్యంగ్యంగా అడిగేవాడు. 30 కోట్ల జనాభాఉండే మీరంతా మనుష్యుల గొర్రెలా ? అని ఎత్తిపొడిచేవాళ్లు. కార్మికుల్లోను తదితరుల్లోను భారతీయులపట్ల సానుభూతి ఉన్నవారు బొత్తిగా లేకపోలేదు. కాని వారుకూడా కొంచెం సంకోచిస్తూ "అమెరికన్లు బానిసత్వాన్ని అసహ్యించుకుంటారు. మీరు బానిసలు. ఏమి చేస్తాం" అని సమాధానం ఇచ్చి సంతృప్తిపడేవాళ్లు. ఇన్ని సంవత్సరాల స్వానుభవం ఏర్పడినతర్వాత భారతీయులు నిజంగా బానిసలే అనే నగ్నసత్యాన్ని తేలికగా తోసిపుచ్చలేక పొయ్యారు. ఈ ప్రత్యక్షానుభవం వల్లనే వారి హృదయాల్లో ఒక నూతన భావోదయం కలిగింది. ఒక నూతన సంచలనం బయలుదేరింది.

కెనడాలోకూడా ఇదే పరిస్థితి అనారోగ్యకరములయిన హోండురాస్ ప్రదేశాల్ని భూలోకస్వర్గమని కెనడా ప్రభుత్వం తెగపొగిడింది. భారతీయులు అక్కడికి రావలసిందని ఆహ్వానించింది. ఈ విషయాన్నిగురించి కెనడా ప్రభుత్వంతో సంప్రతించడానికి భగవాన్‌సింగ్ బలవంత్‌సింగ్ సంత్‌తేజాసింగ్‌ల నాయకత్వంకింద ఒక డిప్యుటేషన్ వెళ్ళింది. అక్కడి పరిస్థితుల్ని స్వయంగా తిలకించారు. భూలోక స్వర్గమని ప్రకటించిన ప్రదేశం నిజంగా భూలోక నరకం అని తెలుసుకున్నారు. ప్రభుత్వమే ఖర్చులన్నీ భరించినాసరే హోండురాస్‌లో మాత్రం నివసించమని బహిరంగంగా ప్రకటించారు.

ప్రపంచమంతటా అపఖ్యాతిపాలయిన వలస చట్టం 1910 లో ప్యాసయింది. ఈచట్టం ప్రకారం 200 డాలర్లు చేతిలోలేకుండా ఏ ఆసియా దేశస్తుడు కూడా కెనడాలో అడుగుబెట్టకూడదు. ఆ అవకాశంకూడా తన జన్మభూమినుంచి

---

* అమెరికాలో భారతీయు లందర్నీ హిందువులే అని వాడేవాడు

కెనడాకు సరాసరి టికెట్ తీసుకున్న వాళ్ళకు మాత్రమే ఉంటుంది. ప్రత్యేకించి భారతీయుల్ని దెబ్బగొట్టడానికే ఈచట్టం ఉద్దేశింప బడింది. బానిస ప్రజలయిన భారతీయులకు తమ స్వంత నౌకాశాఖ ఎక్కడనుంచి వస్తుంది ?

## నూతన భావోదయం

బానిసదేశంలో జన్మించినందుకు అవమానంచేత కుంగిపోయే ఆ భారతీయులకు అమెరికా ప్రజాస్వామికం ఎడల ఒకవిధమైన అభిమానం ఏర్పడింది. ఆ ప్రజాస్వామికంలో ఉన్న రాజకీయ సమానత పౌరసత్వ హక్కులు, ఆ స్వాతంత్ర్య వాతావరణం వారిహృదయాల్ని బాగా ఆకర్షించాయి. పరిపాలనా విధానంలో మానవుడు సాధించిన ఉత్కృష్ట విజయమే ప్రజాస్వామికమని వారు గుర్తించారు.

వారిహృదయాల్లో స్వాతంత్ర్యాగ్ని ప్రజ్వరిల్లింది. తమ జాతి అవమానాన్ని సహించలేక పోయ్యారు. ప్రజాస్వామిక సిద్ధాంతాలు వారి మనస్సు నాకర్షించాయి. ఒక నూతన జాతీయచైతన్యం వారిని కదిలించివేసింది. వారిలో ఒకనూతన స్ఫూర్తిరేకెత్తింది. ఐర్లండ్ చైనా ఈజిప్ట్ టర్కీ వగైరా దేశాల్లో నూతనంగా ఆవిర్భవించి విజృంభిస్తూ ఉన్న జాతీయోద్యమాలు వారిలో ఒకకొత్త ఉల్లాసం ఉత్సాహం కలిగించాయి. విప్లవసిద్ధాంతాల్ని బాగా ఆకళింపు జేసుకున్న హర్‌దయాల్ బర్కతుల్లాలాంటి ప్రతిభావంతుల చేయూత దొరికింది. ఇన్నాళ్ళనుంచి ఒక క్రమవిధానంలేకుండా భిన్న భిన్న ముఠాల్లో పనిజేస్తూవున్న ఈ ధీశాలురు పంజాబీ కార్మికులతో చక్కని ఘనిష్ఠసంబంధాన్ని ఏర్పరచుకున్నారు. కాలిఫోర్నియాలోని స్టాక్‌టన్‌లోను, కెనడాలోని వేన్‌కవర్‌లోను ఉన్న గురుద్వారాలు చురుకైన రాజకీయ కేంద్రాలుగా మారాయి.

వేలకొలది మైళ్ళదూరాన ఉన్న కాలిఫోర్నియా పొలాల్లోను, ఆరెగాన్ వాషింగ్టన్ ఫ్యాక్టరీల్లోను ఒకేభావం ఒకేపట్టుదల ఒకేధ్వని ప్రతిధ్వనించింది — "బ్రిటిషు ప్రభుత్వంమీద తిరుగుబాటు"

నూతనంగావచ్చిన ఈ జాగృతిని సమీకరించి నిర్మాణ యుతమయిన ఒక ఉద్యమ స్వరూపం ఇవ్వడమే నాటి ప్రధానకర్తవ్యం.

# గదర్ పార్టీ

అస్టోరియావద్ద ఒక కలపకార్ఖానాలో పని జేసే బాబాసోహన్‌సింగ్ భాక్నా గదర్ పార్టీనిర్మాణంలో ప్రధాన పాత్ర వహించాడు. 1913 మార్చి 13వ తేదీన అక్కడే ఒక మీటింగు జరిపారు. మొత్తం 120 మంది భారతీయులు ఆ సభకు హాజరయ్యారు. ఇందులో 40 మంది ఆరెగాన్ వాషింగ్టన్ నగరాల్లోని ఫ్యాకరీలనుంచి ప్రతినిధులుగా వచ్చారు. ఈ మీటింగులో జేసిన తీర్మానాన్ని బలపర్చడానికి తర్వాత శాన్‌ఫ్రాన్సిస్కోలో 1913 నవంబర్ 1 వ తేదీన ఎక్కువమంది ప్రతినిధులతో మరోపెద్ద సమావేశం జరిగింది. ఈ రెండు సమావేశాల్లో మొత్తం 15 వేలడాలర్లు చందారూపంగావసూలుజేశారు. "అమెరికా హిందీ అసోసియేషన్" అనే పేరుతో పార్టీని నిర్మించారు. ఉర్దూ హిందీ మరాఠీ గురుముఖీ ఈ నాలుగుభాషల్లో గదర్ (తిరుగుబాటు) అనే ఒక వార పత్రికనుకూడా నడపడానికి తీర్మానించారు. 1857 లో జరిగిన తిరుగుబాటుకు చిహ్నంగా ఆ పేరు పెట్టడమయింది. ఈ పత్రికనుబట్టే క్రమంగా ఈపార్టీకి గదర్‌పార్టీ అనేపేరు స్థిరపడిపోయింది.

ఈ పార్టీనిర్మాతల్లో ప్రముఖులు సోహన్‌సింగ్‌భాక్నా, జ్వాలాసింగ్, వాసఖాసింగ్, సంతోఖ్‌సింగ్, కర్తార్‌సింగ్, కేసర్‌సింగ్, పృధ్వీసింగ్, రూర్ సింగ్, నిధాన్‌సింగ్‌మహేశ్రీ, నిధాన్‌సింగ్‌ఛూగా, కాన్షీరామ్, జగత్‌రామ్, కర్మసింగ్‌ఛీమా, భాగ్‌సింగ్‌కెనడియన్, షేర్‌సింగ్, లాల్‌సింగ్, ఉధమ్‌సింగ్ కాసెల్, సంతసింగ్ గండివిండ్, హర్‌నామ్‌సింగ్‌టుండిలట్, ఈ త్యాగ మూర్తులు మాతృభూమి స్వాతంత్ర్యంకోసం అసమాన ధైర్యసాహసాలు ప్రదర్శించి ఆదర్శప్రాయులయిన యోధాను యోధులు.

భారతదేశంలో బ్రిటిష్‌ప్రభుత్వాన్ని కూలదోసి ఆ స్థానంలో స్వతంత్ర సమానతమీద ఆధారపడిన ప్రజా ప్రభుత్వాన్ని స్థాపించడమే ఈ పార్టీ ప్రధానాశయంగా పేర్కొనబడింది. ఈ లక్ష్యాన్ని సాధించుటకు ఒక్క సాయుధ జాతీయ విప్లవమే సరియైన పంథా అని నిర్దేశింపబడింది. ప్రపంచంలో ఎక్కడ

టానిసత్వం ఉన్నాసరే ఎదిరించి పోరాడడమే గదర్ పార్టీ సభ్యుని ప్రధాన కర్తవ్యం అని ప్రకటించబడింది.

మొదటిసారి జరిగిన ఎన్నికల్లో సోహన్‌సింగ్ భాక్నా ప్రెసిడెంటుగాను హరదయాల్ సెక్రటరీగాను ఎన్నుకోబడ్డారు. జ్వాలాసింగ్ కేసర్‌సింగ్‌లు ఉపాధ్యక్షులయ్యారు. కాన్షీరామ్ కోశాధికారి. కరీమ్‌బక్ష్ మున్షీరామ్ ఇద్దరూ ఆర్గనైజింగ్ సెక్రటరీలు. మరొక ఆర్గనైజింగ్ కమిటీకూడా ఏర్పడింది. ఈ కమిటీలో ఎక్కువమంది పై నుదహరించిన పార్టీనిర్మాతలే ఉన్నారు. రాజకీయ కార్యక్రమం చురుకుగా కొనసాగించడానికి రహస్యపద్ధతుల్ని అవలంబించడానికి ముగ్గురితోగూడిన ఒక ప్రత్యేక కమిషన్ ఎన్నుకోబడింది. గదర్ పత్రికను ప్రకటించడంలో కర్తార్‌సింగ్, హర్‌నామ్‌సింగ్, జగత్‌రామ్‌లు హర్‌దయాల్‌కు తోడ్పడుతూ ఉండేవారు.

గదర్ పార్టీ సెంట్రల్ ఆఫీసుకు ' జుగాంతర్ ఆశ్రమ్ ' అని పేరుపెట్టారు. ఇది శాన్‌ఫ్రాన్సిస్కోలో 436 హిల్ స్ట్రీట్‌లో ఉండేది. 1918 తర్వాత 5 వుడ్ స్ట్రీట్‌లో పార్టీ తన స్వంతభవనాన్ని నిర్మించుకుంది.

1913 నవంబర్ 1 వ తేదీన సామ్రాజ్యవాద వ్యతిరేక జాతీయ విప్లవ ఉజ్వలసందేశంతో గదర్‌పత్రిక మొదటిసంచిక వెలువడింది. ప్రతి సంచికలో బ్రిటిష్‌ప్రభుత్వ పరిపాలనవల్ల దేశంలో ఎటువంటి చెడుఫలితాలు కలిగాయో, తిండీ తిప్పలులేక ప్రజలు ఏ విధంగా క్రుంగి కృశించి పోతున్నారో వివరంగా తెలియజేయబడుతూ ఉండేది. స్వాతంత్ర్య పోరాటంలో పాల్గొనే వీరులు ఉరి కంబాలనైనా కౌగిలించుకోడానికి సిద్ధంగా ఉండాలని హెచ్చరిస్తూ ఉండేది. గదర్‌సభ్యులకు పార్టీ వాగ్దానం చేయగలిగింది ఒక్క వీరమరణమే అని స్పష్టంగా చెప్పుతూ ఉండేది. అయినప్పటికి పార్టీ నానాటికి బలపడుతూనేఉంది. సభ్యులసంఖ్య అయిదువేలవరకు పెరిగింది. చందాలు విరాళాలు విరివిగా వస్తూ ఉండేయి. రేత్రింబవళ్లు రెక్కలు ముక్కలు జేసుకుని కష్టపడి చెమటోడ్చి కూడబెట్టిన ఈ డబ్బు ఎంతవిలువ అయిందో నాయకులకు పూర్తిగా తెలుసు. అందువల్లనే ప్రతి దమ్మిడీని ప్రాణతుల్యంగా చూస్తూ ఉండేవాళ్ళు. నాయకులు తమ

# కొమగటామారూ

1910 లో కెనడియన్ ప్రభుత్వం గావించిన వలసచట్టం ఇకముందు వలసవచ్చేవారినే కాకుండా బర్మా, మలయా, సింగపూర్. చైనాదేశాల్లో ఉన్న భారతీయుల్నికూడా దెబ్బగొట్టింది. ఇంకాముందుకువచ్చే అవకాశం లేకపోవడం చేత ఎక్కడి భారతీయులు అక్కడే ఉండిపోవాలసి వచ్చింది. ఇతరదేశాలకు వెళ్ళి తేలికగా జీవయాత్ర గడపగలమనే గంపెడాశతో పాపం వీరు తమకిదివర కున్న పొలం పుట్రకూడా తాకట్టు బెట్టారు. అమ్మివేశారు. కెనడాలో ఉన్న భారతీయుల భార్యలు, తల్లులు. తోబుట్టువులు క్వారంటైన్సులో కొన్నిమాసాలు తమజీవితం గడిపి మళ్ళీ తిరిగి వెళ్ళుదామని కెనడాతీరానికి చేరుకున్నారు. ఈ దుర్ఘటనను గురించి భారతీయులంతా బ్రహ్మాండమయిన ఆందోళన చేశారు. కాని లండన్‌లోవున్న మొండిఘటం ఇండియా మంత్రికి చీమ అయినా కుట్టినట్టు లేదు. డిప్యుటేషన్ వెళ్ళినవారితో సంప్రదించడానికి కూడా నిరాకరించాడు.

కెనడియన్ ప్రభుత్వం పునరాలోచించడానికి ఇష్టపడలేదు. తానుబట్టిన కుందేటికి మూడేకాళ్ళని బిర్రబిగిసి కూర్చుంది.

జీవన భృతికోసం వెళ్ళిన ఈకార్మికులే ఆతలబిరుసు ప్రభుత్వంయొక్క సవాలుకు జవాబు చెప్పాలనుకున్నారు. అమెరికాలోను కెనడాలోను చందాలు విరాళాలు వసూలు జేశారు. కామగటామారూ అనే ఒక జపాన్ ఓడను హాంగ్ కాంగ్‌వద్ద బాబాగుర్‌దిత్‌సింగ్ అద్దెకు తీసుకున్నాడు. కలకత్తా సింగపూరులలో 400 మంది ప్రయాణీకుల్ని ఎక్కించుకొని ఆ ఓడ తిన్నగా కెనడాకు బయలు దేరింది. మే 23 వ తేదికి వేంకవర్ చేరింది. క్రొత్తగా జేసిన చట్టంలో ఉన్న అన్నిషరతులను పూర్తిజేసినప్పటికి కెనడియన్ ప్రభుత్వం ఆ ప్రయాణీకుల్ని తమదేశంలో అడుగుబెట్టరాదని నిషేధించింది. ఓడను మళ్ళీ వెనక్కు దిప్పి ఇండియాకు తీసుకొని పోవాలసింది అని ఆర్డర్ జారీచేసింది.

ఈ అక్రమమైన ఆర్డరుకు ప్రయాణీకులు తల ఒగ్గలేదు. ఉభయులపక్షాలకి పోరాటం ప్రారంభమయింది. రోజులు రోజులు గడచి పోతున్నాయి. ఓడలో ఉన్న ఆహారసామగ్రి అయిపోవచ్చింది. చివరకు త్రాగడానికి నీళ్ళుకూడా కరువై

కున్న సర్వస్వం పార్టీకేఅర్పించి చాలీచాలని స్వల్పవేతనాలతో హోల్ టైమర్స్‌గా పనిచేస్తూ ఉండేవారు.

గదర్ పత్రికతోపాటు పార్టీకూడా కెనడా, మలయా, జపాన్, చైనా, ఫిలిప్పైన్స్, ఫిజీ, అర్జెంటైనా చివరికు ఇండియాకుకూడా వ్యాపించింది. ఒక్క అమెరికా కెనడాల్లోనే కొద్దిమాసాల్లో 72 కు పైగా పార్టీశాఖలేర్పడ్డాయి.

నవయువకులయిన గదర్‌పార్టీ సభ్యులు తమలాగే స్వాతంత్ర్యకోసం పోరాడే రష్యా, చైనా, ఐర్లండు, దేశీయులతోకూడా సంబంధం ఏర్పరచుకున్నారు. 'జుగాంతర్ ఆశ్రమ్' లో రోజుకు చాలీచాలని రెండు డాలర్లతో జీవితం గడిపే 25 మంది విప్లవకారుల్ని చూచి ఒక విదేశ మిత్రుడు "భారతీయు లీవిధంగాఉండి పనిజేస్తూ స్వాతంత్ర్య పోరాటం కొనసాగిస్తే భారత దేశంలో స్వాతంత్ర్య భానూదయం పొడసూపడానికి ఇక ఎంతో ఆలస్యం బట్టదు." అని తన అభిప్రాయాన్ని వెలిబుచ్చాడు.

గదర్‌పార్టీ ఒక సామాన్య కుట్రలాంటిదికాదు. అది ఒక మహోఉద్యమం.

బ్రిటిష్ ప్రభుత్వంకూడా ఈవిషయాన్ని గమనించింది. గదర్ పార్టీని ఏలాగయినా విచ్ఛిన్నం చేయాలని ప్రయత్నించింది. గ్రంథీస్ (మతగురువులు) అనేమిషతో గూఢచారుల్ని మెల్లమెల్లగా దిగుమతిచేసింది. ఈ సి. ఐ. డి. లు గురుద్వారాల్లోచేరి (సిక్కుల పూజామందిరాలు) గదర్‌పార్టీ నాయకులకు వ్యతిరేకంగా తీవ్రమయిన ప్రచారంచేస్తూ ఉండేవాళ్ళు. ఈకృత్రిమ గ్రంథివేషధారులు అమెరికాలోని అభివృద్ధి విరోధకులతో చేయిచేయి గలిపి భారతీయ వ్యతిరేక ప్రచారాన్ని ఇంకారెచ్చగొడుతూ ఉండేవాళ్ళు.

1914 మార్చిలో హర్‌దయాల్‌ను అమెరికన్ ప్రభుత్వం అరెస్టుచేసింది. కాని పార్టీ అతన్ని జామీన్‌మీద విడిపించి స్విట్జర్లాండ్ పంపింది. ఆ జామీన్ డబ్బును ప్రభుత్వం తన బొక్కసంలో జమకట్టుకొంది.

తర్వాత హర్‌దయాల్ పార్టీతో ఎటువంటి సంబంధం పెట్టుకోలేక పోయ్యాడు. అంతటితో అతని విప్లవపాత్ర పరిసమాప్తి అయింది. కాని అమెరికాలో మాత్రం తుపాను చెలరేగుతూనేఉంది. పార్టీకూడా మూడు పువ్వులూ ఆరుకాయలుగా దినదినాభివృద్ధినందుతూ ముందుకు సాగిపోతూ ఉంది. ఇంతలో యూరోప్ ఖండమంతటా యుద్ధమేఘచ్ఛాయలు ఆవరించాయి.

పోయ్యాయి. అంతమాత్రపు బెదిరింపులకు ఈ ప్రయాణీకులు లొంగేవారు కాదని ప్రభుత్వం గ్రహించింది. కెనడా సైనికులు వచ్చి కామగటామారూను ముట్టడించారు. కెనడా తీరాన్నుంచి కదలి దూరంగా వెళ్ళకపోతే కాల్పులు సాగిస్తామని ప్రకటించారు.

కెనడాలోను అమెరికాలోను ఉన్న భారతీయులందరు అభేద్యమయిన ఐక్యతతో ప్రయాణీకుల న్యాయసమ్మతమైన హక్కుల్ని కాపాడడానికి నడుం గట్టారు. ఓడకివ్వవలసిన బాడుగడబ్బు 22 వేల డాలర్లు అప్పటికప్పుడు వసూలు జేసి పూర్తిగా ఇచ్చివేశారు. అనేకచోట్ల సభలు సమావేశాలు జరిపి బ్రహ్మాండమయిన ఆందోళన లేవదీశారు. చివరకు అనేకమంది కెనడా దేశస్థులుకూడా ఈ అన్యాయాన్ని అరికట్టవలసిందని బహిరంగ గా ప్రకటించారు. కెనడా ప్రభుత్వం తలపెట్టిన దుర్మార్గానికి భారతీయులు ఆవేశపరవశులై పోయ్యారు. ఈ విషయాన్ని గురించి చర్చించడానికి వేన్‌కవర్ గురుద్వారంలో 4000 మంది భారతీయులు సమావేశమయ్యారు. అదే సమయానికి కెనడా సైనికులు కాల్పులు సాగిస్తామని చేసిన ప్రకటనకూడా వారికి అందింది. కుక్కకాటుకు చెప్పుదెబ్బ. హింసకుహింసే సమాధానం. దెబ్బకుదెబ్బ తీయాలిసిందే అనుకున్నారు. "కామగటామారూ మీద కాల్పులుసాగిస్తే పట్నమంతా దగ్ధమై పోవాలిసిందే. ప్రభుత్వానికి దీనితో బుద్ధిరావాలి" ఇదే ఆపీడిత హృదయాలనుంచి నాడు పైకుబికిన గంభీరసినాదం.

కాని ప్రయాణీకుల పరిస్థితులు నానాటికి విషమించాయి. అన్నపానాదులు కూడా కరువైపోయ్యాయి. తిండీ తిప్పలులేకుండా ఈ కొద్దిమంది ఎంతకాలం ఒక బలిష్ఠమైన ప్రభుత్వాన్ని ఎదిరించి పోరాడగలరు? గత్యంతరం లేక జూలై 23 వ తేదీన కామగటామారూ రేవును వదలిపెట్టి వెనక్కి మళ్ళింది. ప్రయాణీకులకయిన ఖర్చుల్ని మాత్రం భరించడానికి కెనడా ప్రభుత్వం అంగీకరించింది.

కామగటామారూ ఒక విప్లవ నౌకగా జగత్ప్రసిద్ధిగాంచింది. ఇందులో ఉన్న ప్రయాణీకులిదివరకే తమ సర్వస్వం విప్లవ పోరాటానికే అర్పించారు. బ్రిటిష్‌సామ్రాజ్య వాదానికి శాశ్వతంగా సమాధిగట్టి సర్వసౌఖ్యాల కాలవాలమైన

స్వతంత్రభారతదేశాన్ని నిర్మించడమే ఈ భారతయోధుల జీవిత పరమావధి. నవయువకుడయిన గురుముఖ్ సింగ్ కూడా ఈ వీరాగ్రేసరుల్లో ఒకడు.

ఈ ప్రయాణీకులకు సహాయం జేయడానికి గదర్ పార్టీ తన సర్వశక్తులూ ఉపయోగించింది. సోదర భారతీయులకు జరిగిన ఈ ఘోరమయిన అవమానాన్ని చూచి సహించలేకపోయింది. ఓపికకుకూడా ఒక హద్దూపద్దూవుంటుంది ఎన్నో సంవత్సరాలనుంచి హృదయక్షేత్రంలో కుములుతూన్న అగ్నిపర్వతం బ్రద్దలైంది.

# జన్మభూమికి పునరాగమనం

విదేశాల్లోవున్న భారతీయుల్ని పార్టీ ఒక నిర్మాణంలోనికి తీసికొచ్చింది. ఎన్నోవిధాల పార్టీవారిని అభివృద్ధిపరచింది. వారిహృదయాల్లో నాటినస్వాతంత్ర్య బీజాలు పెరిగి నేటికి మహావృక్షాల్లాగా అన్ని వైపులకు వ్యాపించాయి. ఇదివరకు కూలీ డబ్బులకోసం మామూలుగా పోటీపడే ఆ కార్మికులే నేడు ఒకే ఆశయంతో ఒకేలక్ష్యాన్ని సాధించడంకోసం భాయి భాయీలుగా చేయిచేయీ కలిపి విశాల భావప్రేరితులై పొంగిపొరలే ఉత్సాహంతో ఒకేతాటిమీద ముందుకు సాగిపోతున్నారు. ఒకళ్ళ పొట్టగొట్టి మరొకళ్ళు పొట్టనింపుకునే రోజులు దాటిపోయ్యాయి. దొరలకింద తాబేదార్లుగా ఉండి ఒకళ్ళమీద ఒకళ్ళు చాడీలుచెప్పి సమ్మెలు భగ్నం జేసే ఆ కాలంగడచి పోయింది. ఇప్పుడంతా ట్రేడ్ యూనియన్‌లో చేరి తమ కార్మిక సంఘాన్ని ఒక అమోఘశక్తిగా బలపరచుకున్నారు. పగలల్లా పనిజేసి మైమరచి తాగితందనాలు దొక్కుడంలో పేరెన్నికగన్న భారతీయ కార్మికులు కార్మికోద్యమంలో చేరినతర్వాత త్రాగుడు తమ భారత జాతికే అవమానకరంగా ఎంచుకొని దాన్నిపూర్తిగా విసర్జించివేశారు. వారిలో నూతనంగా రేకెత్తిన జాతీయోద్యమాన్ని చూచి అమెరికా దేశీయులెంతో ఆశ్చర్యపోయ్యారు, ముగ్గురు అమెరికన్లు (ఇందులో ఒకస్త్రీకూడ ఉంది) గదర్ పార్టీ వీరులతోకలసి తాముకూడా బ్రిటిషు ప్రభుత్వంతో పోరాడడానికి ఇండియా వచ్చారు. కాని ఈ ముగ్గుర్నీ బ్రిటిషు ప్రభుత్వం వెంటనే అరెస్టుచేసి అమెరికాకు పంపించివేసింది. భారతీయుల దౌర్భాగ్యస్థితికి చివరకు అమెరికన్ పెట్టుబడిదార్లుకూడా చాలా విచారించారు.

సామ్రాజ్యవాద వ్యతిరేక ప్రచారాన్ని తీవ్రంగా కొనసాగించడానికి 1913 వ సంవత్సరంలో ముగ్గురు గదర్ పార్టీ ప్రతినిధులు భారతదేశానికి వచ్చారు. బ్రిటిషు ప్రభుత్వాన్ని కూలదోసే అంతిమ పోరాటం ఏనాటికయినా ఈ గడ్డ మీద జరగాలిసిందే అనే విషయం గదర్ పార్టీ మొదటే గ్రహించింది. అమెరికాదేశంలో తాము నిర్మిస్తూ ఉన్న ఆ మహోద్యమం అంతా భారత స్వాతంత్ర్య అంతిమ పోరాటానికి నాంది మాత్రమే అని కూడా వారు గుర్తించారు. వారి హృదయాల్లో రగుల్కొంటూ ఉన్న బ్రిటిష్ విద్వేషాగ్ని కామగటామారూ ఉదంతంతో మరింత తీవ్రంగా ప్రజ్వరిల్లింది. నలుదిశలా అవరిస్తూ ఉన్న యుద్ధమేఘచ్ఛాయలు వారిని అతి శీఘ్రంగా కర్తవ్యోన్ముఖుల చేశాయి. అమెరికాలో అనేకసభలు సమావేశాలు జరిపారు. వేలకొలది భారతీయులు రాబోయే స్వాతంత్ర్య పోరాటంలో పాల్గొంటానికి వాలంటీర్లుగా ముందుకు వచ్చారు.

కామగటామారూ ప్రయాణీకులతోపాటు సోహన్‌సింగ్ భాక్నా కూడా అమెరికానుంచి ఇండియాకు ప్రయాణమయ్యాడు. యుద్ధం ప్రారంభమయిన వెంటనే కర్తార్‌సింగ్, పృథ్వీసింగ్, కర్మసింగ్‌ఛీమా, కేసర్‌సింగ్, జ్వాలాసింగ్, రూర్‌సింగ్, జగత్‌రామ్ వగైరాలతోగూడిన మరోదళంకూడా అమెరికా నుంచి ప్రయాణమయింది. "బ్రిటిష్ ప్రభుత్వాన్ని చావుదెబ్బ గొట్టడానికి మంచి తరుణమిదే కాబట్టి సభ్యులందరూ వెంటనే ఇండియాకువచ్చివేయ వలసింది"గా పార్టీ ఆర్డరిచ్చింది.

విదేశాల్లో ఎక్కడెక్కడో ఉన్న పార్టీ సభ్యులంతా గృహోన్ముఖులయ్యారు. ఎన్నో సంవత్సరాలనుంచి కష్టపడి దమ్మిడీ దమ్మిడీ కూడబెట్టి సంపాదించిన లక్షలాది రూపాయల వ్యాపారాన్నీ, లాభసాటి ఉద్యోగాల్నీ, తృణప్రాయంగా విడనాడి మాతృభూమికి ప్రయాణమయ్యారు. సాయుధ విప్లవానికి కావలసిన సామగ్రినికూడా సేకరించారు అయుధాలే వారికి ఇప్పు డన్నిటికంటె ప్రియతమమయిన వస్తువులు.

భారతదేశంలోని నిజపరిస్థితులు వీరికి సాకల్యంగా తెలియవు. ఇలాంటి సదవకాశం చేజారిపోతే మళ్ళీ దొరకడం అసంభవం అని వారి ఉద్దేశం ఈ

స్వాతంత్ర పోరాటంలో తమ ప్రాణాల్నికూడా బలి ఇవ్వవలసి ఉంటుందనే విషయం మాత్రం వారికి స్పష్టంగా తెలుసు. అయినప్పటికి తమ బొందిలో నుంచి జీవుడు సెలవు పుచ్చుకోకముందే బ్రిటిష్ ప్రభుత్వాన్ని చావుదెబ్బ గొట్ట గలమనే గట్టినమ్మకం వారికి ఏర్పడింది.

జపాన్‌లో బర్కతుల్లా, షాంగ్‌హేలో మథ్రాసింగ్, హాంగ్‌కాంగ్‌లో భగవాన్‌సింగ్, గదర్‌పార్టీని నిర్మించారు.

ప్రయాణీకులు తమ జన్మభూమికి తిరిగివస్తూ మార్గమధ్యంలోఉన్న చైనా జపాన్‌దేశాల్లో నివాస మేర్పర్చుకొన్న సోదర భారతీయులందరికి ఈ విప్లవ సందేశాన్ని అందజేశారు. హాంగ్‌కాంగ్‌లోను సింగపూర్‌లోను సైనికులుగా ఉంటూ ఉన్న సోదర దేశీయుల్లోకూడా ఒక నూతనోత్తేజాన్ని పురికొల్పారు. ఎక్కడికక్కడే అనేకమంది కొత్తగావచ్చి ఈ దళంలో చేరుతున్నారు. గుజర్‌సింగ్ సుఖాసింగ్‌లు ఈవిధంగా మార్గమధ్యంలో కలిసినవారే.

ఆ విప్లవనౌక పొగమంచుతో ఆవరించబడియున్న అండమాన్‌సమీపానికి చేరుకుంది. సామ్రాజ్యవాద వ్యతిరేక పోరాటంలో పాల్గొనే విప్లవయోధులకు ప్రాప్తించేది ఈ నరకకూపమే. ఎంతమంది స్వాతంత్ర్యవీరులు.

" రాతిగుండెలు గలిగిన రాచభటుల
కర్కశాఘాతముల మేను కందిపోయి
కాలిసంకెల లటు ఇటు కదలకుండ
కొండరాతి గోడలమధ్య కూరుచుండి
గడుపుచుండిరొ కటికి చీకటుల నిశల "

అని ఊహించుకుంటూ కండ్లవెంట నీళ్లు బెట్టారు. మాతృభూమికివెళ్ళి, సామ్రాజ్యవాదప్రభుత్వాన్ని సర్వనాశనంచేసి మీచేతిసంకెళ్లుబద్దలుకొట్టి మిమ్ముల్ని విడిపిస్తామని దృఢప్రతిజ్ఞ చేశారు. మళ్ళీ సంవత్సరం తిరిగి వచ్చేటప్పటికి వారిలో ఎక్కువమందికి ఆ కటిక చీకటికొట్లే నివాసస్థానాలు అవుతాయి అనే విషయం ఆ ఉత్సాహంలో పాపం వారు గుర్తించలేకపొయ్యారు.

# తుపాకిగుండ్లతో సన్మానం

గదర్ పార్టీ సభ్యులు విప్లవ కార్యక్రమంతో తిరిగి వస్తున్నారన్న సంగతి బ్రిటిష్ ప్రభుత్వానికి ముందుగానే తెలిసింది. రామచందర్ లాంటి గూఢచారులు ఇదివరకే గదర్ పార్టీలో ప్రముఖస్థానాల్ని ఆక్రమించుకున్నారు. అసలు పార్టీ కూడా తన కార్యక్రమాన్ని గాని సిద్ధాంతాన్నిగాని గోప్యంగా ఉంచడానికి ఎప్పుడూ ప్రయత్నించలేదు. తగినంత అనుభవంలేకపోవడంచేత 'సభ్యులందరు ఇండియాకు వెళ్ళాలి' అనే నిర్ణయాన్ని కూడా రహస్యంగా ఉంచలేకపోయింది. ఆ ఉత్సాహ ప్రవాహంలో వారు మరేవిషయాన్ని శ్రద్ధగా ఆలోచించలేదు. హాంగ్‌కాంగ్‌నుంచి ప్రత్యేకంగా మరికొందరు సి. ఐ. డి. లు కూడా వారిని వెన్నాడుతూనే ఉన్నారు. కలకత్తా చేరినవెంటనే వారిని ప్రభుత్వం ఆహ్వానించింది. వారికోసం చార్జిలేకుండా ప్రత్యేకంగా స్పెషల్ రైళ్లకూడా ఏర్పాటు చేసింది. అవసరమయితే మిలిటరీనికూడా సిద్ధంగానే ఉంచుకుంది.

సెప్టెంబర్ 27 వ తేదీన కామగటామారు హుగ్లీ చేరింది. 29 వ తేదీ ఉదయం గం 11 లకు బడ్జ్‌బడ్జ్ వద్ద లంగరువేసింది. హాంగ్‌కాంగ్‌లోను సింగపూర్‌లోను ప్రయాణీకులు దిగడానికి అనుమతించలేదు. స్పెషల్ రైళ్ళతోపాటు కలిసి రావడానికి ప్రయాణీకులు పూర్తిగా నిరాకరించారు. ఉభయపక్షాలమధ్య సంఘర్షణ ప్రారంభమయింది. పోలీసులు కాల్పులు సాగించారు. 18 మంది మరణించారు. 31 మందిని అరెస్టుచేశారు. గురుదత్‌సింగ్‌తోసహా సుమారు 30 మంది తప్పించుకు పోయ్యారు. బడ్జ్‌బడ్జ్ సంఘర్షణలో చనిపోయిన స్వాతంత్ర్య యోధులను కీర్తిస్తూ వ్రాసిన పద్యాలు పాటలు నేటికీ అనేక మంది పంజాబీల నాలుకలమీద చిందులుదొక్కుతూ ఉన్నాయి.

షాంగ్‌హై, హాంగ్‌కాంగ్, పెనాంగ్, రంగూనుల్లోవున్న భారతీయులకు ఈ వార్త తెలిసింది. తమ సోదర భారతీయుల్ని ఈ విధంగా తుపాకులతో పేల్చి నందులకు పట్టరాని ఆగ్రహం కలిగింది. ఉద్రేకం సముద్రంలాగా పొంగి పొరలింది. కానివారు ఆత్మనిగ్రహం కోల్పోలేదు. తీవ్రంగా ఆలోచించారు. ఇక అజాగ్రత్తగా ఉండగూడదని నిర్ణయించుకున్నారు. చైనా విప్లవకారులతో కలిసి

సంప్రదిస్తే వారుకూడా ఇదే సలహాఇచ్చారు. తమతోపాటు తెచ్చుకుంటూ ఉన్న ప్రాణతుల్యములయిన ఆయుధాల్నికూడా విసర్జించివేశారు బర్మామీదుగా కొందరు ఇండియాకు రావడానికి ప్రయత్నించారు. మిగతావారంతా చిన్నచిన్న ముఠాలుగా చీలి ఇండియాలో జొరబడడానికి కొత్త కొత్త మార్గాల నన్వేషించారు.

ముందే జాగ్రత్త పడవలసిందిగా ఇచ్చిన సూచనలు నిర్ణీతసమయానికి అందరికి అందలేదు. అందువల్ల అనేకమంది వీటిని పాటించలేక పోయ్యారు. బాబసోహన్‌సింగ్ ఒక వందమందితోసహా వచ్చి ఇండియాలో దిగీదిగడం తోనే ప్రభుత్వం అరెస్టుచేసింది. టోసామారూలో వస్తూఉన్న 173 రు కూడా ఇదేవిధంగా పట్టుబడ్డారు. ఈ పట్టుబడిన వారిలో పలువురు ప్రముఖపార్టీ నాయకులుకూడా ఉన్నారు. ఈ అరెస్టుచేసినవారిలో 73 ని తర్వాత ప్రభుత్వం విడిచిపెట్టింది. మిగతా వందమందినీ మాంట్‌గోమెరీ ముల్తాన్ సెంట్రల్ జైళ్ళల్లో బంధించింది. *

ఇతర దేశాలనుంచి ఈ టైములో భారతదేశానికివచ్చిన 3125 మందిలో సుమారు ఒక వెయ్యిమంది అరెస్టు చేయబడడంగాని, ఇంటర్న్ చేయబడడం గాని జరిగింది. తర్వాత మరికొందరు తమ మాతృభూమికి తిరిగివచ్చారు. మొదటి ప్రపంచయుద్ధం మొదలయిన రెండు సంవత్సరాల్లో ఇండియాకు తిరిగి వచ్చినవారు మొత్తం 8 వేల మంది. (అప్పటికి గదర్‌పార్టీ సభ్యత్వం 12 వేల వరకూఉంది.) ఇందులో 400 మందిని ప్రభుత్వంజైల్లోబెట్టింది. 2500 మందిని ఇంటర్న్‌చేసింది.

---

* ముల్తాన్ జైళ్ళోఉన్న ఈ ఖైదీల్ని ఒకసారి మైకేల్ ఓడ్వయెర్‌ముందు (అప్పుడు పంజాబు గవర్నర్) వరుసగా ఒక లైన్‌లో నుంచోబెట్టారు- ఆ గవర్నర్ మహాశయుడు "అయితే పంజాబ్‌మీద సర్వాధికారంమీదే అని మీ అభిప్రాయమన్నమాట" అని ఖైదీల్ని ఎగతాళి చేశాడు. వెంటనే అతను నోరు మూసేటట్టు "పంజాబేకాదు. ఇండియా అంతా మాదే. ఈ నాడు గాకపోతే ఇంకొకనాటికయినా మా దేశాన్ని మేమే పరిపాలించుకుంటాం" అని ఘాటుగా సమాధానం ఇచ్చారు.

ఈ ఖైదీల్నిగురించి ఓడ్వయెర్ తానువ్రాసిన India as I knew it అనే గ్రంథంలో "ఈ ముఠాను జైల్లోబెట్టకుండా బైటఉంచితే రాష్ట్రమంతా ఏమి అయి పొయ్యేదో? తలుచుకుంటే వళ్లు జలదరిస్తుంది" అని వ్రాశాడు.

గదర్‌పార్టీ వీరుల్ని ఎదుర్కోడానికి ప్రభుత్వం ప్రత్యేక ఆర్డినెన్సుల్ని ప్యాసు చేసింది. ఇందుమూలంగా తనకు సంక్రమించిన ప్రత్యేక అధికారాల్ని ఉపయోగించి దమనవిధానాన్ని విచ్చలవిడిగా కొనసాగించింది. అమానుషంగా హింసించింది. భారతదేశానికి తిరిగివస్తూ ఓడలోనే ఈ విప్లవమూర్తులు అనేక ప్లానులు వేసుకున్నారు. ఎవరు ఏ ప్రాంతంలో ఉండి పనిచేయాలిసిందికూడా నిర్ణయించుకున్నారు. కాని గూఢచారులద్వారా ముందే వాసనపట్టిన బ్రిటిష్‌ప్రభుత్వం ఆ ప్లానులేమీ కొనసాగకుండా మొక్కలోనే తుంచివేసింది.

## సాయుధ విప్లవానికి సన్నాహం

గదర్‌పార్టీ ఎత్తులన్నీ భగ్నం జేశాంగదా అని గవర్నమెంట్ మురిసిపోయింది. పార్టీ ఇక నామరూపాలు లేకుండా పోయింది అని తప్పుడంచనా వేసింది.

ఇండియాకు తిరిగివచ్చిన 6 వేలమందిలో దాదాపుసగంమంది ప్రభుత్వపు కండ్లల్లో దుమ్ముగొట్టి అంతర్ధానమయ్యారు. ఇందులో చాలామంది తమఇండ్లకు వెళ్ళి సంసార తాపత్రయంలో పడిపోయినమాట వాస్తవమే. కాని కొందరు మాత్రం పల్లెపల్లెకు వాడవాడకు తిరిగి విప్లవసందేశాన్ని అందజేస్తూనేఉన్నారు. కర్తార్‌సింగ్, కాన్షీరామ్, జగత్‌సింగ్, పింగ్లే మొదలయిన విప్లవవీరుల జాడను ప్రభుత్వం ఎంతప్రయత్నించినా తీయలేకపోయింది. పండిట్ జగత్‌రామ్ కలకత్తాలో పోలీసులు చూస్తూ ఉండగానే వాళ్ళకు టోపీవేశాడు. రావల్‌పిండి దగ్గిర రైల్లోనుంచి పృథ్వీసింగు తప్పించుకొని దారిపట్టాడు. గురుముఖ్‌సింగ్ మొదలయినవారు ఇంటర్న్‌మెంటు ఆర్డర్ని ఉల్లంఘించి తమమిత్రులతో వచ్చి కలుసుకున్నారు. కర్మసింగ్‌ఛీమాలాంటి మరికొందరు ఇంటర్న్‌మెంటులో ఉండే తమకార్యక్రమాన్ని కొనసాగించారు. మొదటవేసుకున్న ప్లానంతా విచ్ఛిన్నమైపోయింది. కాని ఈవిప్లవవీరులు తమ పట్టుదలను మాత్రం విడువలేదు. 'యశోవా మృత్యుర్వా' అనే దృఢనిశ్చయంతో అపూర్వ ధైర్యసాహసాలతో తమబాధ్యతను నెరవేరుస్తూనే ఉన్నారు.

స్వాతంత్ర్య సందేశాన్ని సైనికుల్లోకి కూడా తీసుకవెళ్ళి మిలటరీలో తిరుగుబాటు తీసుకరావడంవల్లనే బ్రిటిషు ప్రభుత్వాన్ని మెడబెట్టి బైటకిగెంటగలం అని వారినమ్మకం. ఈప్లాను తప్పకుండా జయప్రదం అవుతుందని వారికి విశ్వాసం ఏర్పడింది. మిలిటరీలో ఉన్నవారుకూడా తమలాంటి పేదరైతులే. సైనికుల్లో పైగా తమసోదరులు, బంధువులు, మిత్రులు ఎందరో ఉన్నారు. బ్రిటిష్ ప్రభుత్వంమీద వారికి కూడా చాలా అసంతృప్తి ఏర్పడింది. "మెసపొటేమియా, ఫ్రాన్సు మొదలయిన కాని దేశాలకు ఎక్కడికో వెళ్ళి తమ ప్రాణాల్ని బలిబెట్టడందేనికి? సామ్రాజ్యవాదుల పొట్టనింపడానికేనా? తమరక్తాన్ని ధారబోసి అంతగా విజయాన్ని సాధిస్తేమాత్రం అందులో చిన్నం ఎత్తయినా లాభం తమకు దక్కుతుందా?" ఇతర దేశాలకు వెళ్ళమని ప్రభుత్వం ఇచ్చే ఆర్డర్ని మిలిటరీ ఇదివరకే అసహ్యించుకుంటోంది. దీనికితోడు కొంచెం జ్ఞానప్రబోధం కలిగిస్తేచాలు. అగ్నికణం వేయడమే ఆలస్యం క్షణంలో దావాగ్నిగామారి దగ్ధం జేయడానికి సిద్ధంగా ఉంది.

శచీంద్రనాథ్ సన్యాల్, వి. జి. పింగ్లే, రస్‌బిహారీబోసులద్వారా బెంగాల్లో, యు. పి. లో విప్లవగ్రూపులకు చెందిన వారితో కొత్తగా సంబంధం ఏర్పరచుకున్నారు. కార్యక్రమాన్ని రహస్యంగా కొనసాగించే విధానంలో ఈగ్రూపులకు ఎక్కువ అనుభవంఉంది. కాని పీటిపలుకుబడి కాలేజి విద్యార్థులు, మధ్య తరగతియువకులనుంచి దాటి బైటికి వ్యాపించలేదు. రైతు ప్రజాసామాన్యంలోకి మొట్టమొదట విప్లవసందేశాన్ని తీసుకపోయింది గదర్‌పార్టీయే.

తమ పునాదిని గట్టిపరచుకోవాలని తీవ్రంగా కృషిచేశారు. నలుగురు అయిదుగురు సభ్యులతోగూడిన గ్వెరిల్లాగ్రూపుల్ని నిర్మించారు. చిన్నచిన్న గురుద్వారాలు విప్లవ కేంద్రాలుగా మారాయి. పోలీసు బెదరింపులకు లెక్కజేయకుండా అనేక గ్రామాలు ఈ విప్లవవీరులకు ఆశ్రయమిచ్చాయి. వారి సాహిత్యం విరివిగా ప్రచారంలోకి వచ్చింది.

అన్నిటికంటె ముఖ్యంగా మిలిటరీలో చేసిన కృషిచాలా ప్రశంసనీయమయింది. రివెన్షా కాలేజి(ఒరిస్సాలో) ఇదివరకు విద్యార్థిగా ఉన్న 19 సంవత్సరాల వయస్సుగల కర్తార్‌సింగ్ ఇందులో ఆదర్శప్రాయంగా కృషిచేశాడు. ఒక ప్రదే

శాన్నుంచి మరొక ప్రదేశానికి సైకిల్‌మీద తిరుగుతూ సైనికులందరికి ఈ విప్లవ సందేశాన్ని అందజేస్తూ వుండేవాడు. వయస్సులో పిన్నవాడయినా కర్తార్‌సింగ్ విప్లవోద్యమనిర్మాణంలో ప్రధాన పాత్రవహించాడు. బన్నూనుంచి బెనారస్ వరకు అతను చూడని కెంటోన్మెంట్ (స్థాయీమిలిటరీ కేంద్రం) లేదు. అనేక చోట్ల విప్లవకేంద్రాల్ని ఏర్పాటుచేశాడు. ప్రతిభాశాలిఅయిన ఈ యువకుని సమయస్ఫూర్తికి ఎంత ఐనా మెచ్చుకోవాలి. ఒక పెద్ద అధికారిలాగ సూటువేసి నీటుగావెళ్ళిపోతూ ఉంటే ఇతరులెవరూ ఇతన్ని పీసమంతయినా సందేహించేవాళ్ళుకాదు. ఇతన్నిజూచి ఎవరో గొప్పవారు వస్తూఉన్నారని గార్డ్సు పక్కకు దప్పుకొని వంగివంగి సలాములు జేసేవాళ్లు. ఇతరదేశాలకు పంపుతు ఉన్నారని అదివరకే అసంతృప్తిచెందియున్న సైనికుల వద్దకువెళ్ళి "ఎక్కడికో వెళ్ళిచావడ మెందుకు ? చావదలచుకుంటే పవిత్రమయిన మన మాతృభూమి స్వాతంత్ర్య సంపాదనార్థం ఈ విప్లవ పతాకంకింద చావడం అంతకంటె అనేక రెట్లు మంచిదికాదా ? " అని అడిగేవాడు. ఫిరోజ్‌పూర్ రావల్‌పిండి లాహోరుల్లో ఉన్న పటాలాలు తిరుగుబాటు చేయడానికి హామీ ఇచ్చాయి. మీరట్, లక్నో, ఫిజాబాద్, కాన్పూర్, అలహాబాదుల్లో రగిల్చిన ఈ అగ్నిజ్వాల జబ్బల్‌పూర్ దక్కాదాకా అలుముకుంది. ఈమంటలుమనదేశ సరిహద్దుల్నిదాటి బర్మా మలయాలకు కూడావ్యాపించాయి. దీనికి రంగూన్‌లో ఉన్న 16 డ ఫెరిన్ స్ట్రీటు ప్రధాన కేంద్రమయింది.

సైనికుల్లోబాగా అసంతృప్తివ్యాపించి ఉంది. దీనితోబాటు నైరృతపంజాబ్‌లోఉన్న మహమ్మదీయరైతుల్లోకూడా ఆర్థికసంక్షోభం ఎక్కువయింది. ప్రభుత్వాన్ని చావుదెబ్బగొట్టడానికి ఇదేమంచి తరుణం అనుకున్నారు.

1915 ఫిబ్రవరి 21 వ తేదీ తిరుగుబాటు దినంగా నిర్ణయించబడింది. గవర్నమెంటుకు ప్రతికూలంగా డిసెంబర్‌నుంచే పరిస్థితులు విషమించసాగాయి. పోలీసులు మిలిటరీ ఉండేప్రదేశాల్లో సంఘర్షణలు ఆరంభమయ్యాయి. విప్లవపోరాటాని కవసరమయిన డబ్బు సంపాదించడంకోసం ప్రభుత్వ ఖజానాలు, మెయిల్ సంచులు, రైల్వేస్టేషన్లు లూటీచేశారు. ప్రభుత్వం అనేకమందిని అరెస్టు చేసింది. రాష్ట్రప్రభుత్వం కేంద్రప్రభుత్వాన్ని డిసెంబర్ 19 వ తేదీన ప్రత్యేక

ఆర్డినెన్స్పాస్ చేయవలసిందిగా కోరుతూ ఇలావ్రాసింది. "ప్రస్తుతపరిస్థితుల్ని బట్టి ఇప్పుడీ విప్లవకారుల్ని విచారణతంతు నడపడం అంతశ్రేయస్కర మయిన పనికాదు. క్రిమినల్ లా కింద చాలాకాలం జైల్లోనే బెట్టి జాగుసేయాలి."

ఫిబ్రవరి 21వ తేదీ సమీస్తున్నకొలదీ ప్రయత్నాలుకూడా తీవ్రమయ్యాయి. లాహోరు కేంద్రంగా జేసుకొని అన్ని వైపుల వలబన్నారు. అమృత్సర్‌లో ఒక ముద్రణశాలనుకూడా ప్రారంభించారు. లోహట్‌బడ్డీలోను, ఝాబేవాల్‌లోను బాంబ్ఫ్యాక్టరీలు నిర్మించారు. ఆయుధాలు సేకరింపబడుతూ ఉన్నాయి. కాబూల్‌కు జగత్‌రామ్‌ను ఝాన్సీ పరమానంద్‌ను బెంగాల్‌కు పంపించారు. నాలుగురంగుల జాతీయపతాకను పార్టీజెండాగా నిర్ణయించారు. విప్లవానికి సంబంధించిన ప్రత్యేక సాంకేతికాలు చిహ్నాలు దుస్తులు సర్వంసిద్ధం అయ్యాయి. బ్రిటిషు ప్రభుత్వం మీద యుద్ధం ప్రకటించేతేదీ సమీపించింది.

పరిస్థితులుకూడా అన్నీ అనుకూలంగాఉన్నట్లు కల్పిస్తున్నాయి బ్రిటిషు సైన్యంలో ఎక్కువభాగం ఫ్రాన్సుయద్ధరంగములో నిమగ్నమైఉంది. అసంతృప్తి జెందిన ప్రజలసంఖ్య దేశంలో నానాటికి ఎక్కువవుతూఉంది. యుద్ధం వల్ల ఎన్నో కొత్తఇబ్బందులు కలిగాయి. ధరలు విపరీతంగా పెరిగిపొయ్యాయి. నలుమూలలా చిత్రవిచిత్ర మయిన పుకార్లు చెలరేగుతూ ఉన్నాయి. ఏకదీక్షతో తపస్సుచేసి 13 సంవత్సరాలు గడువు పూర్తి అయినవెంటనే భారతదేశానికి స్వాతంత్ర్యం తీసుకవస్తానని వాగ్దానంజేసిన శ్రీమహాప్రభు జగబంధుమహర్షి త్వరలోనే హిమాలయ పర్వతగుహల్లోనుంచి బైటికి రాబోతున్నారని దేశంలో గుసగుసలు బయలుదేరాయి. పంజాబులోమొత్తంమీద ఏదోఒక గొప్పవిచిత్రం జరగబోతూ వుందని ఎక్కడోఉన్న కలకత్తా ప్రజలుకూడా ఎదురచూస్తూ ఉన్నారు.

విప్లవ కారులు వివరాలన్నీ చర్చించి, నిర్దుష్ట మయిన ఒక చక్కని కార్యక్రమంవేసుకున్నారు. "మొదటిదాడి రాత్రివేళ సాగించాలి. సైనికుల సహాయంతో బస్తీలు, మిలిటరీ కేంద్రాలు, ఆయుధాగారాలు, పత్రికాకార్యాలయాలు, ప్రభుత్వఖజానాలు, వెంటనే స్వాధీనంజేసుకోవాలి. ఈ మొదటిదాడి ముగిసిన వెంటనే విప్లవ దళాలన్నీ పంజాబులో సమావేశంకావాలి. పంజాబులో స్థావర

మేర్పరచుకొని ఒక సంవత్సరందాకా శత్రువును ఎదిరించి పోరాడాలి. ఒక రాష్ట్రంలో విప్లవ పోరాటం జయప్రదంగా కొనసాగిందంటే ఇంతలో తక్కిన రాష్ట్రాలుకూడా పంజాబునే అనుసరిస్తాయి"

పంజాబుకెంటోన్మెంటులో మొదట తిరుగుబాటు ప్రారంభమై అక్కడ నుంచి తూర్పుదిక్కుగా వ్యాపించాలి. 1857 తిరుగుబాటు తర్వాత బ్రిటిషు ప్రభుత్వాన్ని కూలదోయడానికి జరిగిన గొప్పపోరాటం ఇదే.

## ప్రభుత్వ దాడి

ప్రభుత్వాన్ని దెబ్బగొట్టడానికి ప్లానంతా తయారయింది. అందరిదృష్టి పంజాబుమీదనే కేంద్రీకరింపబడింది. కాని ఇంతలో కథ అడ్డం తిరిగింది.

ఫిబ్రవరి 18వ తేదీరాత్రి తెల్లవార్లు తెల్లసోల్జర్లు కారులమీద లారీలమీద వచ్చి పెద్దపెద్ద బస్తీలనిండా నిండిపోతుంటే సామాన్య ప్రజలందరికి ఆశ్చర్య మయింది. ప్రధాన స్థానాల్లో పోలీసులతోపాటు సైనికులుకూడా వచ్చి వీధుల్లో కాపలాగాస్తూవున్నారు. స్థాయీ మిలిటరీ కేంద్రాలల్లో ఉన్న ఆయుధ సామగ్రిని కూడా బ్రిటిష్ సైనికులు స్వాధీనం చేసుకున్నారు. క్రమశిక్షణ పర్యవేక్షణ అంతా బందోబస్తుగా సాగిపోతూవుంది. ఈ హడావుడి అంతా చూచి ప్రజా సామాన్యం ఆశ్చర్యపోయింది. ఇదంతా యుద్ధానికి సంబంధించిన అత్యవసర సన్నాహం అయి వుంటుందేమో అని ప్రజలు అభిప్రాయపడ్డారు.

ప్రభుత్వం దాడి ప్రారంభించింది. ఇంతకుపూర్వమే గదర్‌పార్టీలో జొర బడిన కిరపాల్‌సింగ్ అనే సి. ఐ. డి. రేపు జరగబోయే తిరుగుబాటునుగురించి ప్రభుత్వానికి ముందే ఆచూకీ యిచ్చి పుణ్యం కట్టుకున్నాడు. అందుచేత ఫిబ్రవరి 19వ తేదీనే ఏలాగయినా విప్లవం తీసుకరావాలని గదర్‌పార్టీ తన శక్తినంతా ధారపోసింది. కాని చేసిన పని అంతా చివరకు బూడిదలో పోసిన పన్నీరు అయింది. గదర్‌పార్టీ పని గండిబడిన చెరువులాగా ఐంది. ఎప్పటి రహస్యం అప్పుడే కట్టదాటి బైటికి పోతూనేవుంది.

విప్లవమూర్తి కర్తార్‌సింగ్ తనతోపాటు 50 మంది విప్లవకారుల్ని తీసుకొని 19వ తేదీ ఉదయం ఫిరోజ్‌పూర్ వచ్చాడు. తన సహజసిద్ధమయిన వాగ్ఝరితో ఉద్రేకపూరితంగా సైనికుల్ని ఉద్బోధించాడు. కాని వ్యర్థమయింది. సైనికుల హృదయాలు నిరాశా నిస్పృహలతో నిండిపోయి ఉన్నాయి. తాము నిస్సహాయస్థితిలో వున్నామని విచారం వెలిబుచ్చారు. కనుసైగతో తెల్లసైనికుల్ని జూపి తలవంచుకొని కన్నీళ్ళు గార్చారు.

వేసుకున్న ప్లానంతా ఈవిధంగా తల్లకిందైపోయింది. ఎన్నో సంవత్సరాలనుంచి నిర్మించుకున్న ఆకాశహర్మ్యాలన్నీ అమాంతంగా కూలిపోయ్యాయి. అహర్నిశలూ నిద్రాహారాలు లేకుండా చేసిన శ్రమ అంతా వృధా అయింది. ఎటువంటి విషమ పరిస్థితుల్లోకూడా ఓటమి ఎరుగని యోధాను యోధుడయిన కర్తార్‌సింగ్ కండ్లవెంటకూడా నీళ్ళు తిరిగాయి.

ప్రభుత్వం తన నిర్బంధవిధానాన్ని జోరుచేసింది. దారుణమైన హింసాకాండతో పంజాబురాష్ట్రమంతా రెండువారాలపాటు అట్టుడికినట్టు ఉడికిపోయింది. 200 మంది అరెస్టుచేయబడ్డారు. కొద్దిమందిమాత్రమే ప్రభుత్వానికి చిక్కకుండా తప్పించుకోగలిగారు. కర్తార్‌సింగ్‌నుకూడా తప్పించుకోమని సలహాయిచ్చారు. కాని అందుకు కర్తార్‌సింగ్ అంగీకరించలేదు. "నా కామ్రేడ్స్ యీవిధంగా బందిఖానాల్లోబడి బాధపడుతూవుంటే నేనొక్కణ్ణి తప్పించుకొని మళ్ళీ ఏవిధంగా వీరిముఖం చూస్తాను" అని సమాధానం ఇచ్చాడు. వజీరాబాద్ దగ్గిర సోల్జర్ల మధ్యనే కర్తార్‌సింగ్ అరెస్టు అయ్యాడు.

మీరట్ దగ్గిర 12వ ఆశ్వికదళ పంక్తిలో బాంబులతోసహా పింగ్లే అరెస్టు చేయబడ్డాడు. యుద్ధనిపుణుల అంచనాప్రకారం ఒక్క పింగ్లేదగ్గిర ఉన్నబాంబులతోనే ఒక రెజిమెంటును పూర్తిగా తుడిచిపెట్టవచ్చు (మైకేల్ ఓడ్వైయెర్)

పెషావరులో జగత్‌రామ్ అరెస్టు అయ్యాడు.

తిరుగుబాటును పూర్తిగా అణగగొట్టివేసి తమ అదుపు ఆజ్ఞల్లో ఉంచుకున్నామని ప్రభుత్వం భావించింది. కాని 1915 సెప్టెంబరు వరకు అక్కడక్కడ సంఘర్షణలు సాగుతూనే ఉన్నాయి.

# చక్రవర్తిమీద యుద్ధం జేసినందుకు

అరెస్టు జేసిన విప్లవకారులందర్నీ విచారించడం కోసం ప్రభుత్వం తనకు కావలసిన తతంగమంతా ముందే తయారు చేసుకుంది.

ఇంపీరియల్ లెజిస్లేటివ్ కౌన్సిల్‌ద్వారా తక్షణమే భారత రక్షణచట్టం ప్యాసై బైటికివచ్చింది. విప్లవకారుల్ని విచారించడానికి ప్రత్యేక న్యాయస్థానాలను సృష్టించే అధికారం ఈచట్టానికి ఉంది. ఈచట్టంప్రకారం ముద్దాయిలకు తమ వాఙ్మూలాలన్నిటి లపరుచుకునేందుకు అవకాశంగాని, అప్పీల్ చేసుకునే అధికారంగాని లేదు క్రొత్తగా నిర్మించిన మూడు ప్రత్యేక న్యాయస్థానాల్లో ఒకటి పంజాబులో ఏర్పాటుచేశారు. ఈన్యాయస్థాన సభ్యుల్లో శివనారాయణశర్మ ఒక్కడే భారతీయుడు.

లాహోరులో 1915 మార్చి 27 తేదీన " మొదటి లాహోరు కుట్రకేసు " విచారణ ప్రారంభమయింది.

ప్రత్యేకించి ఈకేసు విచారణకోసం లాహోర్ సెంట్రల్ జైల్లో 16 వ నంబరు బేరక్‌ను ఖాళీచేశారు. అందులోనే అధికారవర్గం కూర్చోవడానికిగాను కొంచెం ఎత్తుగా ఒక ప్లాట్‌ఫారాన్ని ఏర్పాటుచేశారు. దానికి కుడిప్రక్కగా సి. ఐ. డి. మూకతో పబ్లిక్ ప్రాసిక్యూటర్ పిట్‌మన్ కూర్చున్నాడు. అతని అనుచరులుకూడా అతని ప్రక్కనే ఆసీనులయ్యారు. " బ్రిటిష్ చక్రవర్తిని కూలద్రోయడానికి యుద్ధంజేశారు " అనే నేరం ఆరోపింపబడిన 65 మంది విప్లవకారులు చేతిసంకెళ్ళతో వేదికకు ఎడమ ప్రక్కగా నుంచున్నారు.

ఇతరదేశాలనుంచి వస్తూ ఇండియా గడ్డమీద అడుగుబెట్టక పూర్వమే అరెస్టు చేయబడినవారుకూడా ఈ ముద్దాయిలలో ఉన్నారు. కలకత్తా దగ్గిరనే అరెస్టుచేయబడిన సోహన్‌సింగ్‌భాక్నా ప్రభృతుల్ని అదిరించిబెదిరించిప్రభుత్వం కొంత ఆచూకి తీయాలని ప్రయత్నించింది. డబ్బు ఆశకూడా బెట్టి చూసింది. కాని అవిప్లవమూర్తుల ముందా ఈపప్పులుడికేది ? మిగతా వారంతా ప్రత్యక్ష పోరాటంలో అరెస్టు చేయబడ్డారు, వీరిలో అనేకమంది అమెరికానుంచి తిరిగి వచ్చిన తర్వాత ఒక్కసారి అయినా ఇండ్లకు వెళ్ళి తమకుటుంబాల్ని కూడా

చూసుకోలేదు. కౌమారావస్థదాటీదాటని నూనూగు మీసాల నూత్నయౌవనంలో ఉన్న కర్తార్‌సింగు పృధ్వీసింగు గురుముఖ్‌సింగులతో పాటు ముద్దాయీలుగా నుంచున్న 60 సంవత్సరాల వయోవృద్ధులయిన ఖాన్‌సింగు, నిధాన్‌సింగు, కేసరసింగులమీద సమస్త ప్రజలు విప్లవాశీఃపరంపరలు కురిపించారు.

విచారణ అంతా కేవలం ఒక 'ఫార్సు' అని మొదటే వారంతాగుర్తిం చారు. డిఫెన్సుకూడా పెట్టుకోదలచుకోలేదు. "తాము బుద్ధిపూర్వకంగా హత మార్చదలచుకున్న ప్రభుత్వాన్ని దయాభిక్షపెట్టమని ప్రాధేయపడడం విప్లవ సాంప్రదాయాలకే అవమానకరం" అనుకున్నారు.

ప్రజలకు పైకి చూపెట్టడంకోసం న్యాయం అనే పేరుతో ప్రభుత్వం కొంత దొంగనాటకాన్ని ఆడటానికి ప్రయత్నించింది. ప్రతివాదుల తరపున 9 మంది లాయర్లనుకూడా పెట్టింది. ముద్దాయీల్లో ఇదివరకు కోర్టు అనుభవ మున్నవారెవరూలేరు. వారిలో ఎక్కువమందికి ఇంగ్లీషు రాకపోవడంచేత కోర్టులో ఏమి చర్చిస్తున్నారో వారికి అర్ధమయ్యేదికాదు. ఇంగ్లీషువచ్చిన కొద్ది మందికూడా ఆ నిరుపయోగమయిన చర్చల్ని లెక్కజేయలేదు. కోర్టులో జరిగే విచారణఅంతా స్వయంరాజా స్వయంమంత్రిలాగాఉంది. పోలీసుల చెప్పుచేతుల్లో మెలగే కొందరు తొత్తుల్ని పట్టుకొనివచ్చి వాళ్ళనే సాక్షులుగా గుర్తించమని విప్లవకారుల్ని ఒత్తిడిజేశారు. ఇందుకు జ్వాలాసింగ్ తీవ్రంగా తన అసమ్మతిని తెలియపరిచాడు. "కోర్టుచర్చల్లో మధ్య జోక్యం కలిగించుకొని ఆఫీసరును అవమాన పరచాడనే అపరాధంక్రింద జ్వాలాసింగ్‌కు 30 కొరడాదెబ్బల శిక్ష విధించబడింది. సాక్షులనే పేరుతో పట్టుకరాబడిన తొత్తులు పోలీసు ఇన్‌స్పెక్టరువైపు చేయిజూపి 'వారు ఏలాచెప్పమని సెలవిస్తే మేం అలాగే చెపుతాం' అని కోర్టులో బహిరంగంగా చెప్పేవాళ్ళు. కేసర్‌సింగ్ మాట్లాడుతూ ఒక సందర్భంలో "నన్ను ఓడనుంచి దిగకముందే అరెస్టుచేశారు. కాబట్టి ప్రత్యక్ష పోరాటంలో నేనుకూడా పాల్గొన్నానిచెప్పడం హాస్యాస్పదం" అని సూచిం చాడు. ఇంతమాత్రానికే డిఫెన్స్‌లాయర్ రఘునాథ్‌సాహే గాబరాపడుతూ "ఏమనుకున్నావు? ఉరిదీస్తారు జాగ్రత్త" అని కసురుకున్నాడు. చివరకు తీర్పు ఎలా ఉంటుందో అందరికి ముందుగా తెలిసిన సంగతే.

మాసాలు గడచిపోయ్యాయి 401 ప్రాసెక్యూషన్ తరఫు సాక్షులు 228మంది డిఫెన్సుసాక్షులు చెప్పే అతుకులబొంత సాక్ష్యాన్ని వింటూవుంటే ముద్దాయీలకు నవ్వువస్తూఉండేది. మధ్యమధ్య కడుపుబ్బనవ్వేవారు. ఎగతాళిజేసేవారు. ప్రెసిడెంటు మధ్యమధ్య గంటమోగిస్తూ ఉండేవాడు. మళ్ళీసాక్ష్యం మొదలెట్టగానే పకపకలుసాగేయి. ఆ విప్లవమూర్తులకు ఈ తప్పుడు కోర్టులంటే తృణప్రాయం.

విచారణ ముగింపుదశకు వచ్చింది. "కలకత్తాలో గదర్ పార్టీ సభ్యులను అరెస్టుచేసినతర్వాత బైటనుండి పోరాటాన్ని నడిపిన బాధ్యతఅంతా ఏడుగురు కామ్రేడ్సుమీదేఉంది. వారిదగ్గరనుంచే ఇప్పుడు స్టేట్ మెంట్స్ తీసుకోవాలి" అని నిర్ణయించారు. ఈ ఏడుగురిలిస్టులో ఎవరికివారే తమ పేరుంటే బాగుండునని ఉత్సాహపడ్డారు. ప్రభుత్వం ఏలాగయినా చివరకు ఎవర్నీ మిగలనివ్వదనే విషయము అందరికి తెలిసిందే. అసలు ఆ విప్లవమూర్తుల్లో గవర్నమెంటు విధించేశిక్షకు భయపడేవారు ఎవరు? ప్రభుత్వానికి సూటిగా ఘాటయిన సమాధానం ఇవ్వడమే వారికి కావాలిసింది.

కోర్టుఅంతా నివ్వెరపోయి చూస్తూఉండగా యువకసింహం కర్తార్ సింగ్ ఇలా గర్జించాడు. "ఈ విచారణఅంతా పట్టిబూటకం. సాక్ష్యమంతా శుద్ధాబద్ధం. మేంచేసిందికుట్రగాదు బహిరంగయుద్ధం. ఎన్నోసంవత్సరాలనుంచి మాదేశాన్ని కొల్లగొట్టి మాప్రజల్ని నానాబాధలు పెడుతూ ఉన్న దుర్మార్గ ప్రభుత్వాన్ని ధ్వంసంచేయడానికి యుద్ధంచేశాం. ఇందుకు నిజంగా మేము గర్విస్తున్నాం. ప్రజల నెత్తినెక్కితొక్కే ప్రభుత్వాన్ని కూలదోయడం కోసం ప్రయత్నం జేయడం ప్రతిభారతీయుని యొక్క జన్మహక్కు మాప్రయత్నం జయప్రదం కాకపోయినా మాకర్తవ్యాన్ని మేమునిర్వర్తించాం" బ్రిటిష్ ప్రభుత్వ పరిపాలనలో దేశం ఏవిధంగా నాశనమైపోయిందో, నానాటికి నిరుపేదలై తిండిలేక ప్రజలు ఏవిధంగా మలమల మాడి చస్తూ ఉన్నారో కర్తార్సింగు తన స్టేట్ మెంటులో కండ్లకు కట్టినట్లుగా చిత్రించిచాడు. బానిసప్రజలు ఎటువంటి అవమానాలకు గురికావలసి వస్తుందో కటికిగుండెలుకూడా కరగినీరై పోయేటట్లుగా అభివర్ణించాడు. కామగటామారూ ఉదంతం అంతా పూసగ్రుచ్చినట్లుచెప్పాడు. గదర్ పార్టీ ఏవిధంగా నిర్మించబడిందో. ఏ ఆశయసిద్ధికోసం పనిజేస్తుందో

మొదటినుంచి తుదివరకు సాంగోపాంగంగా చెప్పాడు. తాము ప్రారంభించిన యుద్ధం ఈసారి ఫలప్రదంకాకపోయినా ఈనాడు రగిల్చిన ఈ విప్లవాగ్నికణం క్రమక్రమంగా భూమ్యాకాశాలంటే మహామంటగా మారి ఈ బ్రిటిషుసామ్రాజ్య వాదాన్ని త్వరలో బూడిదపాలు చేయకుండా వదలిపెట్టదని ఆ స్వాతంత్రి యోధుడు ఆ విప్లవమూర్తి తన స్టేటుమెంటును ముగించాడు.

కోర్టులో ఆ సమయంలో ప్రజలు ఎవ్వరూ లేకపోయినప్పటికి కర్తార్ సింగ్ ప్రజల్ని గురించే ఈ మాటలు చెప్పాడు. ముద్దాయీల బంధువుల్నికూడా కోర్టుకురావడానికి ప్రభుత్వం అనుమతించలేదు. ప్రభుత్వ ఉద్యోగస్థులు వేయికండ్లతో పరిశీలించి వడపోసిన వార్తలు మాత్రమే బైటి ప్రపంచానికి అందుతున్నాయి. అయినప్పటికి ఏ నాటికయినా తన విప్లవ సందేశం ప్రజాసామాన్యానికి అందుతుందనే గట్టినమ్మకంతోనే కోర్టులో ఆ మహాపురుషుడు స్వాతంత్ర్య శంఖం పూరించాడు.

ఈ ఆదర్శయోధుని వాగ్ధోరణికి జడ్జికూడా నిశ్చేష్టుడై పోయ్యాడు. తేనె లొలికే పలుకులు, చిరునవ్వు నవ్వుతో కళకళ లాడుతూ ముద్దులు మూటగట్టే చిరుతప్రాయపు ఆ చిన్నారి ముఖముచూచి ఆ కటికిరాతి గుండెలుకూడా చెమ్మగిల్లాయి. ఈ మాటలకు ఫలితమేమిటో తెలుసా? అని ఒక న్యాయాధికారి ప్రశ్నించాడు, ఆ తెలుసు మృత్యువు. ఉరిశిక్ష. అంతేనా? అని నిర్భయంగా సమాధానం ఇచ్చాడు. స్టేటు మెంటును ఉపసంహరించుకోవాలిసందిగా కర్తార్ సింగ్‌ను కోరారు. కాని ఆ వీరాభిమన్యుడందుకు అంగీకరించలేదు. న్యాయాధికారి, కర్తార్ ఇచ్చిన స్టేటుమెంటును రికార్డు చేయకుండా మళ్ళీ తిరిగిబాగా ఆలోచించుకొని రేపు చెప్పవలసింది అని ఆనాటికి విచారణ ఆపుజేశాడు.

రెండోరోజు కోర్టు మళ్ళీ సమావేశమయింది. కర్తార్‌సింగ్‌ను అదేప్రశ్న అడిగారు. నిన్న తానిచ్చిన స్టేటుమెంటులో ఒక్క కామాకూడా మార్చడానికి వీల్లేదని జవాబు చెప్పాడు.

ఎంత ప్రయత్నించినా లాభం లేకపోయింది. "నేను చేసింది అపరాధం గాదు. తిరుగుబాటు చేయడం ప్రతి బానిసయొక్క జన్మహక్కు" ఇది ఒక్కటే ఆ వీరుడిచ్చే సమాధానం.

ఇతర కామ్రేడ్స్ ఇచ్చిన స్టేటుమెంట్సుతోపాటు కర్తార్ స్టేటుమెంటును కూడా జడ్జి రికార్డు జేశాడు.

తీర్పు తయారు జేసుకోడానికి న్యాయాధికారులు చల్లగా ఉండే సిమ్లా కొండలకు వెంచేశారు. ఖైదీలకు మళ్ళీ ఆ చీకటికొట్లే ప్రాప్తమయ్యాయి. నిప్పులు గ్రక్కే మండువేసవి ఎండల్లో ఆ రెండుమాసాలు ఆ జైలు కూపంలోనే కాలంగడిపారు. చేతులకూ కాళ్ళకు ఎప్పుడూ జోళ్ళువేసి ఉంచేవాళ్ళు. పగలూ రాత్రికూడా ఆ కొట్లల్లోనుంచి బైటికి రానిచ్చేవారుకాదు.

సెప్టెంబర్ 13 వ తేదీ మళ్ళీ ఆ 16 వ నంబర్ బేరక్‌లోనే తీర్పు జెప్పారు.

కర్తార్‌సింగ్ (లూధియానా) తో పాటు 24 గురికి ఉరిశిక్ష. వీరి ఆస్తి పాస్తులుకూడా ప్రభుత్వమే స్వాధీనపర్చుకుంటుంది. జగత్‌సింగ్ (లాహోరు) హర్‌నామ్‌సింగ్ (సైల్‌కోట్) పింగ్లే (మహారాష్ట్ర) బక్షిష్‌సింగ్ (అమృత్‌సర్) సూర్యేన్‌సింగు (అమృత్‌సర్) మరొక సూర్యేన్‌సింగు (ఈ ఏడుగురినీ తర్వాత ఉరిదీశారు) సోహన్‌సింగుభాక్నా (అమృత్‌సర్) కేసర్‌సింగు (అమృత్‌సర్) నిధాన్‌సింగుఛూగా (ఫిరోజ్‌పూర్) పరమానంద్ (యూపీ) జగత్‌రామ్ (హోషియార్‌పూర్) హర్‌నామ్‌సింగు టుండిలట్ (హోషియార్‌పూర్) పృథ్వీసింగు (అంబాలా) నంద్‌సింగు (లూధియానా) తదితరులు.

యావజ్జీవ ద్వీపాంతరవాసశిక్ష విధింపబడినవారు. వీరి ఆస్తిపాస్తులుకూడా ప్రభుత్వమే స్వాధీనపర్చుకుంటుంది. జ్వాలాసింగు (అమృత్‌సర్) వాసఖాసింగు (అమృత్‌సర్) రూర్‌సింగు (ఫిరోజ్‌పూర్) ఊధామ్‌సింగు (అమృతిసర్) తర్వాత కాబూలులో చంపబడ్డాడు. గురుముఖ్‌సింగు (లూధియానా) షేర్‌సింగ్ (అమృత్‌సర్) మదన్‌సింగుగాగా (లాహోరు)

మరో ఆరుగురికి సామాన్యశిక్షలు విధింపబడ్డాయి. మిగతావారిని నామకః విడుదలజేసి జైలుగేటుల్లో తిరిగి అరెస్టుచేశారు. ఇదంతా వీరిపై మరొకకేసు పెట్టడానికి మాత్రమే. వీరిలో ఒకరయిన బాబా గుజర్‌సింగుకు యావజ్జీవ శిక్షవిధింప బడింది. ఇక ఉరిశిక్షవిధింపబడిన వారిలో 15 మంది ఓడదిగి ఇండియాగడ్డమీద అడుగు బెట్టక పూర్వమే అరెస్టు చేయబడ్డారు. మిగతా

వారిలో ముగ్గురికి మాత్రం ఒక సాయుధ సంఘర్షణతో సంబంధం ఉంది. ఈ సంఘర్షణలో ఒక పోలీసు చచ్చిపోయ్యాడు. అప్పీలు చేసుకోడానికి అవకాశం లేదు. కొద్దిమంది మాత్రమే మెర్సీపిటిషన్ పెట్టడానికి అంగీకరించారు.

ఉరిదీసేరోజున బొక్కెనలతో నీరు తీసుకొనివచ్చి జైలుగదులముందు ఉంచారు. శుభ్రంగా అందరు స్నానజేశారు. పూజాపునస్కారాలు పూర్తిచేసుకున్నారు. ఒకళ్ళకంటెముందు ఒకళ్ళు ఉత్సాహంగా ఉరికంబం ఎక్కడానికి సిద్ధంగా ఉన్నారు. కొందరు సానుభూతి పరులు వచ్చి విచారంగా మాట్లాడుతూ ఉంటే దేశస్వాతంత్ర్యం కోసం ప్రాణమివ్వడం మహాభాగ్యం. ఇంతకంటె అదృష్టం ఇంకేంగావాలి? అని జవాబు ఇస్తూఉండేవాళ్ళు. చాలాసేపు ఎదురుజూశారు కాని ఆరోజు వారిని ఉరిదీయలేదు. ప్రస్తుతానికి ఉరిశిక్ష వాయిదా వేశామని మరునాడు సూపరింటెండెంటు తెలియజేశాడు.

ఓడ్వామెర్ హింసాకాండ ఒక వైపు జోరుగా సాగుతూఉంది. సిక్కుమతగురువుల దౌష్ట్యం మరోవైపు చెలరేగుతూఉంది. సర్ సుందర్‌సింగ్ మజీథియా, సర్దార్‌బహాదుర్ గజ్జాన్‌సింగ్ లాంటి పెత్తందార్లు గదర్‌పార్టీసభ్యులు, రాజభక్తిని విడనాడి చక్రవర్తిగారిమీద తిరుగుబాటుజేసి నిర్మలమయిన సిక్కుకీర్తికి కళంకంతెచ్చారు. కాబట్టి వారిని సిక్కు మతాన్నుంచి వెలివేశామని సిక్కుమత పీఠం-అకాల్‌తఖ్త్‌నుంచి అధికార పూర్వకంగా ప్రకటించారు. కాని తమ బిడ్డల విడుదలకోసం ప్రజా సామాన్య హృదయం పరితపించిపోయింది. దేశమంతటా బ్రహ్మాండమయిన ఆందోళన బయలుదేరింది ఈ ఆందోళన ఫలితంగా 17 మందికి విధింపబడిన ఉరిశిక్షను యావజ్జీవ శిక్షగా మార్చారు.

కాని జైలు ఆవరణ అంతా విషాదచ్ఛాయలతో నిండిపోయింది. క్రిమినల్ ఖైదీలుకూడా ఏడ్పునాపుకోలేకపొయ్యారు కర్తార్‌సింగ్‌కు వేసిన ఉరిశిక్ష మాత్రం తొలగించలేదు.

1915 నవంబర్ 19వ తేదీ సూర్యోదయ సమయాన కర్తార్‌సింగ్‌తో పాటు అతని ఆరుగురు కామ్రేడ్స్‌ను గదుల్లోనుంచి బైటికి తీశారు. ముఖాల్లో చిరునవ్వులు చిందులు దొక్కుతూ ఉండగా ఆడుకుంటూ పాడుకుంటూ హుషారుగా ఉరికంబాలనెక్కారు.

ఉరిదీసేముందు మళ్ళీ కర్తార్‌సింగ్‌ను తన అభిప్రాయం మార్చుకోవాలసిందిగా కోరారు. రక్షించండి అని ఒక్క మాటఅంటేచాలు ఉరిశిక్ష తప్పిస్తామని చెప్పారు. "నాకున్నది ఒకటేప్రాణం. ఇంకా ఎక్కువప్రాణాలుంటే ప్రతి ఒక ప్రాణాన్ని ఇదేవిధంగా దేశంకోసం బలి ఇచ్చేవాణ్ణి." కర్తార్‌సింగ్ ఇచ్చిన ఈ సమాధానానికి ఉరిదీయడానికిసిద్ధంగా ఉన్న హంతకులుకూడా స్తబ్ధులై పోయ్యారు.

కర్తార్‌సింగ్‌నుగురించి పండిట్ జగత్‌రామ్ ఇలా వ్రాశాడు.

"పంధొమ్మిదివందల పదిహేను నవంబరు పంధొమ్మిదితేదీ
ఆటలతో పాటలతో కళకళలాడే ముఖములతో
యోధానుయోధులు గదరువీరులూ కౌగిలించరీ ఉరికంబమునూ
ఆచంద్రార్కము వెలయును నీకీర్తి, విప్లవమూర్తీ కర్తార్‌సింగ్!
అమరజీవి! జొహారులివిగో, భారత వీరవరేణ్యా,
రణదుందుభి మ్రోగించితివీ, స్వాతంత్ర్యపతాకను ఎత్తితివీ
భారతవీరుల యశశ్చంద్రికలు ప్రపంచమంతట వ్యాపించినవీ
యుద్ధరంగమున కురికెడువారికి నీపేరిక చిరస్మరణీయం"

డిఫెన్స్ ఆఫ్ ఇండియా యాక్టుకింద ఏర్పాటుచేయబడిన ప్రత్యేక న్యాయస్థానాల్లో తొమ్మిది కేసుల్ని విచారించారు. పంజాబ్, యు పి, బెంగాల్, బర్మా రాష్ట్రాల్లో మొత్తం 28 మందిని ఉరిదీశారు. అనేకమందికి యావజ్జీవశిక్ష విధించారు. హర్‌నామ్‌సింగ్, సోహన్‌లాల్ పథక్ ఈ యిద్దర్నీ వీరినలుగురి సహచరులతోపాటు మాండలే కాన్‌స్పిరసీ కేసులో ఉరిదీశారు. హర్‌దత్‌సింగ్, వీర్‌సింగ్, కపూర్‌సింగ్ వగైరాలకు యావజ్జీవశిక్ష విధించబడింది. సోహన్‌లాల్‌ను ఉరిదీయబోతూ ఇప్పటికైనా పశ్చాత్తాపపడి క్షమాపణ కోరుకోవాలిసింది అని అధికార్లు సూచించారు. ఈ మాటలకు సోహన్‌లాల్ చిరునవ్వు నవ్వి

"దుర్మార్గమంతా మీది. ప్రజల్ని పీడించి అన్యాయానికి ఒడిగట్టారు. కాబట్టి క్షమాపణ కోరుకోవాలిసింది మీరుగాని నేనుకాదు. అని జనాబు చెప్పాడు.

ఈ దీర్ఘకాల విచారణలతోపాటు గదర్‌పార్టీ గ్వెరిల్లావీరులమీద కొన్ని ప్రత్యేక విచారణలుకూడా జరిగాయి. లాహోరు సెంట్రల్‌జైల్లో 30 మంది గ్వెరిల్లాయోధుల్ని ఉరితీశారు. వీరిలో కాన్షీరామ్‌కూడా ఉన్నాడు. వీరి శవాల్ని బంధువులకు యివ్వడానికికూడా ప్రభుత్వం నిరాకరించింది.

కెనడాలో గదర్‌పార్టీ నాయకుడైన బల్‌వంత్‌సింగ్ గ్రంథిని సింగపూర్ జైల్లోను డాక్టర్ మథ్‌రాసింగ్‌ను ఇరాన్‌లోను ఉరితీశారు.

మైకేల్ ఒడ్వయెర్ తన గ్రంథంలో ఇలావ్రాశాడు. తిరుగుబాటు కేసుల్ని మినహాయించి సాధారణ కుట్రకేసుల్లోనే 178 మంది ముద్దాయీలు స్పెషల్ ట్రిబ్యూనల్స్‌లో విచారింపబడ్డారు. 38 గురికి ఉరిశిక్ష (ఇందులో 18 మంది ఉరిశిక్ష తర్వాత యావజ్జీవశిక్షగా మార్చబడింది) 58 మందికి యావజ్జీవశిక్ష, మరో 58 మందికి సాధారణ జైలుశిక్షలు ద్వీపాంతరవాసశిక్షలు విధించబడ్డాయి.

జనవరినెల చివరిభాగంలో 130 వ బెలూచ్‌రెజిమెంట్ రంగూన్‌లో తిరుగుబాటు చేసింది. కాని జయప్రదంకాలేదు. 1915 ఫిబ్రవరిలో 5 వ కాల్బలం పూర్తిగా ఒకవారంరోజులు సింగపూర్ కోటను ముట్టడించి తన స్వాధీనంలో ఉంచుకుంది. జారిస్టురష్యా, జపాన్ దేశాల సహాయంతో బ్రిటిష్ ప్రభుత్వం ఈ తిరుగుబాటును అణచివేయగలిగింది. ఈ పోరాటంలో అనేక వందలమంది కాల్చివేయబడ్డారు.

ఇంకా అనేకచోట్ల అనేక విచారణలు జరిగాయి. కోర్ట్‌మార్షల్ క్రింద అనేకమందిని దారుణంగా శిక్షించారు. ఈపోరాటంలో పాల్గొన్న సైనికుల్ని మీరట్ దగ్గిర కాల్చివేశారు. 7 వ రాజ్‌పూట్ రెజిమెంటులో కూడా కొద్ది మందిని ఢిల్లీలో ఉరితీశారు. హవల్‌దార్ లఛ్‌మన్‌సింగు నాయకత్వాన నడప బడుతూ ఉన్న రిసాలానంబరు 23 లో మరొక డజనుమంది, అంబాలా జైల్లో అమానుషంగా హింసించబడ్డారు. వీరిలో అబ్దుల్లా అనే ఒక మహమ్మదీయ సోదరుడుకూడా ఉన్నాడు. సి. ఐ. డి. లు ఇతని దగ్గిరకు చేరి కాఫిరులతో (హిందువులు) కలసి పనిచేయవద్దని కుతంత్రం పన్నాలని చూశాడు. " ఈకాఫి

రులతో కలిసి పనిచేయడంవల్లనే నాకు మోక్షం లభిస్తుంది" అని చెప్పి నోరు మూయించాడు. * గదర్ పోరాటం ఓడిపోయింది. పంజాబును రక్త ప్రవాహంలోముంచెత్తారు. అసంఖ్యాకులు ఉరిదీయబడ్డారు. అనేకులు తుపాకిగుండ్లకు గురి అయ్యారు. గదర్‌పార్టీ సభ్యులు వీరాధివీరుల్లాగ ప్రాణాల్నిత్యజించారు. విచారం అంటే ఏమిటో ఎరుగరు. భయం వారిని సమీపించడానికే స్వయంగా భయపడేది. వారు ఆదర్శయోధులు. చిరస్మరణీయులు. సమస్త ప్రజానీకంచేత పూజింపబడదగినవారు.

అధినివేశం స్వరాజ్యం ఇస్తేచాలు సంతృప్తిపడతామని భారత జాతీయ కాంగ్రెస్ అర్జీలు, మహజర్లు పెట్టుకునేరోజుల్లో గదర్‌పార్టీ సంపూర్ణస్వాతంత్ర్యం

---

* 1916 లో బర్మాలో ఉరితీయబడినవారు నిరంజన్‌సింగ్. నారాయణసింగ్. పహిలియారామ్. పాల్‌సింగ్.

అంబాలా జైల్లో ఉరితీయబడిన రిసాలా నంబరు 23 లోని పన్నెండుగురిపేర్లు. (1) ఇందెర్‌సింగ్. (2) ఇందర్‌సింగ్. (3) బుధ్‌సింగ్. (4) మోటాసింగ్. (5) భగత్‌సింగ్. (6) గుజార్‌సింగ్. (7) జేఠాసింగ్. (8) తారాసింగ్. (9) వాధవసింగ్ (10) అబ్దుల్లా. (11) బూటాసింగ్. (12) లఛ్‌మన్‌సింగ్.

లాహోరుజైల్లో ఉరితీయబడిన 28 మంది గ్వెరిల్లాయోధులు.

(1) బలవంతసింగ్ (2) అర్జన్‌సింగు (3) ఉత్తమసింగు (4) ఈషర్‌సింగు (5) రంగాసింగు (6) వీరసింగు (7) రూర్‌సింగు (8) ధ్యాన్‌సింగు (9) చందాసింగు (10) జీవన్‌సింగు (11) ధ్యాన్‌సింగు (12) జగత్‌సింగు (13) జీవన్‌సింగు (14) లాల్‌సింగు (15) అరూర్‌సింగు (16) ఆత్మసింగు (17) బంతాసింగు (18) హరనామ్‌సింగు (19) కాలాసింగు (20) చందన్‌సింగు (21) ప్రేమ్‌సింగు (22) గంధాసింగు (23) ఇందర్‌సింగు (24) బూతాసింగు (25) జవంద్‌సింగు (26) రామ్‌రాఖా (27) మౌల్వీ అబ్దుల్లా (28) రహ్మత్ ఆలీ ( అన్నిజిల్లాలనుంచి )

మొదటికేసులో ఉరిశిక్ష విధింపబడినవారు హృదయరామ్‌మండీ, రామ్‌శరణ్ (కపుర్థలా) రులియాసింగు (లూధియానా) ఖుష్‌హాల్‌సింగు, వాసవసింగు, కాలాసింగు. ( వీరంతా అమృతసర్‌కు చెందినవారు ) ద్వీపాంతరవాస శిక్ష విధింపబడినవారు. సారన్‌సింగు. బలవంతసింగు. భాయీపరమానంద్. ఇందరసింగు. భిషన్‌సింగు. హజారాసింగు, మంగల్‌సింగు, భిషన్‌సింగు, చుహార్‌సింగు, భాన్‌సింగు, రోడాసింగు, ఇందర్‌సింగు, కాలాసింగు, గురుదత్‌సింగు, ప్యారాసింగు, దివాన్‌సింగు, కృపాల్‌సింగు రఖేక్‌సింగు, ఇందర్‌సింగు, లాల్‌సింగు, కేహర్‌సింగు, జవంద్‌సింగు.

కోసం యుద్ధానికి సన్నద్ధమయింది. బ్రిటిష్‌ప్రభుత్వాన్ని లెక్క-జేయకుండా అద్భుతంగా ఎదిరించి పోరాడింది.

పోరాటాన్ని ప్రభుత్వం రక్త ప్రవాహంలో ముంచివేసింది. కాని ఆ నాడు వారు రగుల్కొల్పిన ఆ విప్లవజ్వాల సామ్రాజ్యవాదాన్ని సర్వనాశనంచేసి కాని శాంతించదు.

గదర్ పార్టీ వీరులిచ్చిన ఆ విప్లవసందేశం ఈ నాటికీ నలుదిక్కులా ప్రతిధ్వనిస్తూ ఉంది.

"ముక్క ముక్కలుగ చించివైచినా
భారతీయ స్వాతంత్ర్య పతాకం
వినువీధులలో ఎగురుచున్నదీ
సుడిగాలికేని పిడుగులకేనీ
శిరమువంచదీ విప్లవజెండా"

## అండమానుల్లో

అండమానుల్లోని పోర్ట్‌బ్లెయిర్‌వద్ద యస్. యస్. మహారాజా ఓడనుండి 1915 డిశెంబర్ 10 తేదీ మధ్యాహ్నం ఇద్దరిద్దరికి కలిపి చేతులకు కాళ్ళకు సంకెళ్ళువేసి దింపారు. ఖైదీల్లో 22 సంవత్సరాల యువకులనుంచి 60 సంవత్సరాల వృద్ధులవరకు ఉన్నారు. న్యాయశాస్త్రరీత్యా 40 ఏండ్లు దాటినతర్వాత ఎవరినీ అండమానులకు పంపగూడదు. కాని ఈ కేసులో న్యాయాన్యాయాల్ని విచారించే నాథుడెవడు? మొదటి లాహోరు కుట్రకేసుకు సంబంధించిన వీరే "ప్రమాదకరమయిన ఖైదీల్లో" మొదటిదళం.

జైలుగేటు దగ్గిరకు వెళ్ళేటప్పటికి జైలరు ఎదురుగా వచ్చాడు. 20 సంవత్సరాలదాకా తనచేతికింద ఉంచుకోవాలిసిన ఖైదీల్ని ఆపాద మస్తకం బాగా తేరిపారంచూశాడు. "రాజ్‌లేనేవాలాలోగ్ రాజ్‌మాంగ్‌తా రాజ్, రాజ్‌నహీఁకోలూ (నూనెగానుగ) దేగా" అని వెకిలిగా యెగతాళి జేశాడు. బాగా కొవ్వుబెట్టి డన్‌లప్‌టైర్‌లాగా ఉన్న అతని దేబెముఖాన్ని చూచి ప్రయాణ బడలికతో

అలసట చెందియున్న ఖైదీలంతా కడుపు చెక్కలయ్యేటట్టు నవ్వసాగారు. తమకు సరిపోయిన ఉజ్జీ దొరికాదనుకున్నారు. ఖైదీల పకపకలు జూచి జైలర్ బారీ ఉగ్రుడై పొయ్యాడు. ఆ మూడంతస్థులజైల్లో మొత్తం 740 గదుల్లో (7 బ్లాకులు) ఖైదీల్ని ఉంచారు.

అండమానులంటే భూలోక నరకమన్నసంగతి అందరికీ తెలిసిందే. ఏమయినాసరే జైలరుముందు ఖైదీలు తల ఒగ్గదలచుకోలేదు.

జైలరుదృష్టిలో మానవులకు పశువులకు భేదం లేదేమో? నూనెగానుగ తిప్పమని ఖైదీలకు ఆర్డరిచ్చాడు. కాని ఖైదీలందుకు అంగీకరించలేదు. తర్వాత ఒక్కొక్కడికి 9 చటాకుల కొబ్బరినార ఇచ్చాడు. దీన్ని ఖైదీలు చేయలేరని తెలిసే బుద్ధిపూర్వకంగా ఈ పని ఒప్పగించాడు. పరమానంద్‌ని (ఝాన్సీ) పిల్చి తానిచ్చినపని ఎందుకు పూర్తిచేయలేదని సంజాయిషీ అడిగాడు. జైలరు మొరటుతనాన్ని జూచి పరమానంద్ నవ్వుతూ సమాధాన మివ్వకుండా అలాగే నుంచున్నాడు. జైలరు మండిపోయి నానాబ డబూతులు తిట్టి కొట్టడానికి ప్రయత్నించాడు. ఆత్మరక్షణకోసం పరమానంద్ ధైర్యంగా ఎదుర్కొన్నాడు. ఇంతలో వార్డర్స్‌వచ్చి స్పృహతప్పి పడిపోయేటట్లు అతన్ని అమానుషంగా కొట్టి జైలు గదితోకి ఈడ్చుకపొయ్యారు.

మళ్ళీ మరునాడు అతన్ని గదిలోనుంచి బైటికి లాగారు. పరమానంద్ కట్టుకున్న బట్టలన్నీ చినిగి తుంపులు తుంపులై పొయ్యాయి. నిన్నటి దెబ్బలకే ఒకవైపు రక్తం గ్రక్కుతూవున్నా జైల్ సూపరింటెండెంట్ ముర్రే ఆర్డర్ ప్రకారం కొరడాలతో మళ్ళీ చావగొట్టి వదిలిపెట్టారు.

అసమ్మతి సూచకంగా ఖైదీలు పని మానేశారు. చీఫ్‌కమిషనర్ ప్రతి ఖైదీదగ్గిరకు వెళ్ళి కొరడాశిక్ష విధిస్తానని బెదిరించాడు. 6 మాసాలు ఏకాంత వాసశిక్ష అసహ్యభోజనం ఒక వారంవరకు చేతులకు జోళ్లు వేయించుకొని నిలువుగాళ్ళమీద నిలబడేశిక్ష. ఒకేసారి ఇన్ని శిక్షల్ని విధించాడు. సంఘర్షణ ప్రారంభమయింది.

గదర్ కేసుల్లో శిక్షింపబడిన ఇతరఖైదీలుకూడా అండమానులకువచ్చారు. వచ్చినవాళ్ళు వచ్చినట్లే పోరాటంలో తాముకూడా భాగస్వాములయ్యారు. దృఢ

కాయులైన ఖైదీల్ని ప్రత్యేకంగా హింసించి చితకగొట్టి పోరాటాన్ని అణగగొట్టివేశాం అనే గర్వంతో బారీ, ముర్రేలు మురిసిపోతూ ఉన్నారు. కాని పోరాటం నూతన శక్తులతో నూతనోత్సాహంతో సాగిపోతూనేఉంది. వేళకు ఇంత తిండికూడా పెట్టకుండా ఖైదీల్ని మాడ్చారు. జబ్బులతో అపరిమితమయిన బాధపడుతూ ఉన్నా జైలు అధికార్లు ఏమాత్రం శ్రద్ధ తీసుకోలేదు. దప్పికతో నాలుక పిడచగట్టుక పోతూఉన్నా ఇన్ని మంచినీళ్లుకూడా సప్లయి చేసిన పాపానబోలేదు. శాంతమూర్తి వాసఖాసింగ్ కూడా అండమాన్ నరక యాతనలుచూచి సహించలేక ఆవేశపరవశుడై పోయేవాడు ఏలాగయితేం చివరకు ఈపోరాటాలసంగతి ఇండియాప్రభుత్వ చెవినబడింది. బారీ. ముర్రేలు పంపే రిపోర్టునే వేదాక్షరంగా నమ్మే భారతప్రభుత్వం ఇందులో జోక్యం కలిగించుకో పోగా “ గదర్‌పార్టీసభ్యులు వట్టి తోదేళ్ళమంద ” అని తెగనాడింది.

అండమాన్ హింసాకాండ నానాటికి శ్రుతిమించి రాగానపడుతూఉంది. ఆదివారంనాడు పనిచేయకపోవడం అవిధేయతగా ప్రకటించబడింది. జైల్లో జరుగుతూఉన్న దుర్మార్గాన్నిగురించి రిపోర్టుచేస్తే బాధ్యతాయుతమైన అధికార వర్గంమీద దురుద్దేశంతో నిరాధారములయిన నీలాపనిందలు మోపడమట. ప్రతి స్వల్పవిషయానికి చేతులకు జోళ్లు, కాళ్ళకు సంకెళ్ళు గోనెదుస్తులు, ఏకాంత వాసశిక్షలు మామూలైపోయ్యాయి. ఒప్పగించిన పనిని పూర్తిచేయలేదనే సాకుతో కొరడాదెబ్బలు కొట్టబోయేముందే దృఢకాయులయిన ఆశుతోష్‌లాహిరీ బోటివార్ని జైలు గదుల్లోనే చచ్చేటట్టు కొట్టేవారు.

60 సంవత్సరాల వయోవృద్ధుడయిన బాబాభాన్‌సింగును అతిఘోరంగా హింసించారు. ఆ దెబ్బల మూలకంగానే తర్వాత రెండురోజులకు ఆ వృద్ధమూర్తి మరణించాడు. బందాసింగు, రామ్‌రేఖా, రులియాసింగు, నంద్‌సింగు, కేహర్‌సింగు, నాథ్‌సింగు, రోడాసింగు ఒకళ్ళతర్వాత ఒకళ్ళు క్రమంగా అంతా మృత్యువు వాతబడ్డారు. కొనఊపిరి కొట్టుకులాడుతూ ఉన్నంతవరకు ఈ వీరులు తమ కర్తవ్యాన్ని నిర్వర్తిస్తూనే ఉన్నారు.

ఈ విధంగా నాలుగు సంవత్సరాలు గడిచాయి. సోహన్‌సింగుభాక్నా మూడుసార్లు, పృధ్వీసింగు 155 రోజులు నిరశనవ్రతం జేశారు. జైల్లో పృధ్వీ

సింగుకు 20 మాసాలు ఏకాంతవాసశిక్ష విధింపబడింది. జ్వాలాసింగును సంవత్సరాల పర్యంతం పంజరాల్లో బంధించారు. ధూర్‌సింగును వారాలకొలది గోడకు నుంచోబెట్టారు. గురుముఖ్‌సింగు ఈ చిత్రవధలన్నిటినీ ఎదిరించి పోరాడాడు. అనేకబాధలకు గురిఅయ్యాడు. అదొక రౌరవనరకం.

ఈ ఖైదీల అచంచల ధైర్యసాహసాలకు అపూర్వ త్యాగపటిమకు. కష్ట సహిష్ణుతకు. సామాన్యఖైదీలంతా స్తబ్ధులై పొయ్యారు. సెబాస్ బాంబ్‌వాలా అని వేనోళ్ళతో కొనియాడారు.

కొందరు పంజాబీ సైనికులద్వారా ఈ హింసాగాధ భారతదేశానికి కూడా వ్యాపించింది. దేశమంతటా తుపానులాగా ప్రజాందోళన చెలరేగింది. ఈప్రవాహాన్ని తట్టుకోలేక ప్రభుత్వం అండమాన్ జైళ్ళను చివరకు మూసివేసింది.

హోరాహోరిగా పోరాటం జరిపి గదర్ వీరులు జయించారు.

పోరాటంలో తమ అమూల్యములయిన ప్రాణాల్ని బలిబెట్టి విజయం సాధించిన ఎనమండుగురు కామ్రేడ్స్ భస్మరాసులమీద కన్నీళ్లు కార్చి గృహాభిముఖులయ్యారు.

1921 జూలైలోమళ్ళీ మాతృభూమిని చేరుకున్నారు. తమకు స్వాగతం ఇవ్వడానికి వేచియున్న అసంఖ్యప్రజానీకాన్ని కాలువలుగట్టు కన్నీళ్ళతో సత్కరించారు.

## విప్లవకారునికి వృద్ధాప్యంలేదు ఎప్పుడూ నవయువకుడే

ఈ ఖైదీలందర్ని ఒకే చోట ఉంచడం ప్రమాదకరమని ప్రభుత్వం భయపడింది. అందువల్ల గ్రూపులు గ్రూపులుగా చీల్చి హజారీబాగ్, యెరవాడా, నాగపూర్, వెల్లూరు, కోయంబత్తూరు జైళ్ళకు పంపించింది.

ఈమార్పుల సమయంలోనే పృధ్వీసింగు, గురుముఖ్‌సింగులు పరుగెత్తి పోయే రైళ్ళల్లోనుంచి దూకి తప్పించుకోగలిగారు.

యుద్ధానంతరం జరిగిన ఖైదీల విడుదల సందర్భంలో బాబావాసఖాసింగ్ తోపాటు ఇంకా 15 మందిని విముక్తి చేశారు.

ఇండియా జైళ్ళకు మార్చినంతమాత్రాన మనకథ అప్పుడే యుద్ధపర్వాన్ని దాటి శాంతి పర్వానికి పోలేదు. మోప్లా తిరుగుబాటు నణగగొట్టడానికి ప్రభుత్వం తన పశుబలాన్నంతా ఉపయోగించింది. కోయంబత్తూరు జైలు ఈ మోప్లా ఖైదీలతో నిండిపోతూవుంది. మోప్లా నవయువకుల్ని ఉరిదీయడం రోజూ పరిపాటి అయిపోయింది. అరెస్టుచేయబడిన పసిపిల్లలకు కూడా తిండీ తిప్పలు బెట్టకుండా రాక్షసుల్లాగా ప్రవర్తించారు. ఈహృదయ విదారకమయిన ఘాతుక చర్యల్ని జూచి గదర్‌వీరుల హృదయం పరితపించి పోయింది. తమవంతు తిండిలోనే కొంతభాగం తీసి ఈపసిపిల్లలకి బెట్టి అలాగే పోషిస్తూ ఉండేవాళ్ళు. ఇదికూడా జైలు అధికారులదృష్టిలో ఒక మహాఅపరాధమైపోయింది. ఈనేరానికి గాను బాబాజ్వాలాసింగును 30 కొరడా దెబ్బలు కొట్టారు. సిక్కు-ఖైదీలకు తల పాగాలివ్వవలసిందనీ, తమ న్యాయసమ్మతమయిన హక్కుల్ని అంగీకరించాలని యెరవాడ జైల్లో నిరశనవ్రతం మొదలెట్టారు. 1929 లో జరిగిన చరిత్రప్రసిద్ధ మయిన నిరశన వ్రతంలో భగత్‌సింగ్ గ్రూపుతోపాటు లాహోర్ సెంట్రల్ జైల్లోఉన్న వృద్ధమూర్తి బాబాసోహనసింగుభాక్నా కూడా పాల్గొన్నాడు. ఇంత వృద్ధాప్యంలో ఉపవాసం జేయవద్దని భగత్‌సింగు ఎంతపట్టుబట్టినా బాబాజీ అంగీకరించలేదు. " ఈపై శరీరం ముసలిది అయిపోతే మాత్రం ఏం? విప్లవకారునికి వృద్ధాప్యమంటూలేదు. ఎప్పుడూ నవయువకుడే " అని సమాధానం ఇచ్చాడు. విప్లవఖైదీలందరితోపాటు బాబాజీ కూడా 1 నెల 15 రోజులు నిరశనవ్రతం జేశాడు.

సంవత్సరాలు గడచిపోయ్యాయి. పొట్టకోసం పట్టపగలే ఖూనీలు చేసిన ఘాతుకుడికికూడా 14 సంవత్సరాలు గడచినతర్వాత జైలునుంచి విముక్తి లభిస్తుంది. కాని వృద్ధమూర్తి అయిన ఈ మహాపురుషుని విడుదలజేయడానికి ప్రభుత్వం నిరాకరించింది. ఈ విప్లవమూర్తి వజ్రసంకల్పాన్ని భగ్నంచేయడానికి 14 సంవత్సరాలు చాలలేదు గాబోలు! "ప్రజాసేవకు ఉపయోగపడని ఈ శరీరం ఉండి మాత్రం ఏంలాభం" అని విసుగెత్తి బాబాజీ ఆమరణోపవాస

దీక్ష బూనాడు. మూడు మాసాలు గడచిన తర్వాత బేషరతుగా 1930 లో ప్రభుత్వం విడుదలజేసింది.

కాంగ్రెస్ ఉద్యమంలో పనిజేస్తూ ఉండగా బాబాజీని వెంటనే మళ్ళీ అరెస్టు చేశారు. జైలునుంచి విడుదలై బైటికిరాగానే రాజకీయఖైదీల విడుదల కోసం తీవ్రమయిన ఆందోళన సాగించాడు. జైల్లోవున్న నంద్‌సింగ్ చుహర్ సింగ్‌లు ఇదేసమయంలో ఆమరణోపవాస దీక్షవహించారు. ప్రజాందోళనవల్ల ప్రభుత్వం ఈ యిద్దర్నీ విడుదలజేసింది. కాని విడుదల అయిన కొద్దిరోజులకే చుహర్‌సింగ్ కీర్తిశేషు డయ్యాడు. ఈ దుర్ఘటనఫలితంగా రాష్ట్రమంతటా బ్రహ్మాండమయిన అలజడి బయలుదేరింది. ప్రభుత్వం లొంగిరాక తప్పింది కాదు. దాదాపు 20 సంవత్సరాలనుంచి జైలుకూపంలోబడి నరకయాతన అనుభ విస్తూవున్న విప్లవయోధుల్ని ప్రభుత్వం విడిచిపెట్టింది. కాని అప్పటికే వీరిలో అనేకమంది ఆరోగ్యం శాశ్వతంగా దెబ్బతినిపోయింది.

గదర్‌పార్టీ వీరులు మళ్ళీ తమ ప్రజలమధ్యకు వచ్చారు. ప్రజల్లో ఎటు జూచినా నూతనోత్సాహం వెల్లి విరిస్తూవుంది. సామాన్యపౌరుల హృదయాల్లో కూడా దేశభక్తి తరంగాలు పొంగిపొరలుతూవున్నాయి. దేశమంతా స్వాతంత్ర్య పిపాసతో తహతహలాడిపోతూవుంది. ఎంతమార్పు ? తమ చిన్నప్పటికోరికలు నేటికి సఫలీకృతం అయినందుకు వారిముఖాలు కళకళలాడాయి. ప్రథమ శాసనోల్లంఘనోద్యమం, అకాలీవుద్యమం, కమ్యూనిస్టు వుద్యమం. చరిత్రప్రసిద్ధమైన కాన్పూరు మీరట్ కేసులు, కీర్తికిసాన్‌పార్టీ, ద్వితీయ శాసనోల్లంఘనోద్యమం రైతుకార్మిక విద్యార్థి ఉద్యమాలు - ఈ సర్వతోముఖమయిన నూతన జాగృతిని జూచివారు ఆనందపరవశులయి పొయ్యారు.

రష్యాలో జరిగిన నవంబర్ విప్లవం యావత్ప్రపంచ ప్రజలకండ్లు తెరిచింది. కష్టజీవులకు ఒక నూతన ఆశాజ్యోతి కన్పించింది. రష్యన్ కమ్యూనిస్టులు తమ దేశంలో రైతు కార్మిక రాజ్యాన్ని స్థాపించి ప్రపంచంలో ఒక నూతన శకాన్ని ప్రారంభించారు. విప్లవయోధులందరికి రష్యా ఒకఆదర్శదేశ మయింది. ఈ నూతన ప్రపంచాన్ని తిలకించడానికి అన్ని దేశాలనుంచి మాస్కో యాత్రలు బయలు దేరాయి. అమెరికాలో ఉన్న గదర్‌పార్టీకూడా-

రష్యాకు తమ ప్రతినిధుల్ని పంపింది. భూలోక స్వర్గంగావున్న ఆ సామ్యవాద ప్రభుత్వాన్ని జూచి వారు ముగ్ధులయి పొయ్యారు. అమెరికాలో ఉన్న బూర్జువా ప్రజాస్వామికానికంటె ఈ సామ్యవాద ప్రభుత్వం ఎంతమహత్తరమయిందో వారు తమ కండ్లారా చూశారు. కష్టజీవులు హాయిగా బ్రతకాలంటే కమ్యూనిజం ఒక్కటే శరణ్యం అని స్వయంగా గుర్తించారు.

అనేక విప్లవ పోరాటాల్లో ఆరితేరిన నిర్మాణకళా కుశలుడు సంతోఖ్ సింగ్ ఇండియాకు వచ్చి ప్రపథమంగా పంజాబులో 'కీర్తి' అనే కార్మికవర్గ పత్రికను స్థాపించాడు. 1928 లో సంతోఖ్‌సింగ్ క్షయగ్రస్తుడుగావడంవల్ల అంతటితో ఆ పత్రికఆగిపోయింది. రైతుకార్మిక ప్రజాసామాన్యంలో 'కీర్తి' అపూర్వమయిన దేశభక్తిని కలిగించింది. ఒక నూతన విప్లవజ్యోతిని రగుల్కొల్పింది. ఇదే సమయంలో ఇంకా అనేకమంది విప్లవకారులు మాస్కోలో విద్యనార్జించి నూతన ప్రపంచ నిర్మాణంలో తాముకూడా తోడ్పడడానికి తమ మాతృభూమికి తిరిగివచ్చారు.

## మళ్ళీ పోరాటంలోకి

యౌవన దశలో వెళ్ళిన ఈ విప్లవయోధులు వృద్ధాప్యంలో మళ్ళీ తమ మాతృభూమికి చేరుకున్నారు. అనేక పోరాటాల్లో ఆరితేరారు. లాఠీ దెబ్బలకు కొరడాదెబ్బలకు గురి అయ్యారు. నానాబాధలను భరించారు. ఉరికంబాలకు సిద్ధమయ్యారు. అండమాన్ నరకకూపంలో అమానుషంగా హింసించబడ్డారు. మృత్యువునుసైతం ఎదిరించి ఢీకొన్నారు. శరీరాలు శిధిలమైపొయ్యాయి. ఆరోగ్యం పూర్తిగాచెడిపోయింది. అయినా వారిలోఉత్సాహం క్షీణించలేదు. ఆ స్వాతంత్ర్యేచ్ఛ అణగారిపోలేదు. ఆ విప్లవాగ్ని చల్లారలేదు. ఇనుమడించిన దీక్షతో రెట్టించినఉత్సాహంతో విశ్రాంతి నపేక్షించకుండా మళ్ళీ కార్యరంగంలోకిదిగారు.

ఒక యుగం గడచిన తర్వాత బాబాసోహన్‌సింగుభాక్నా మళ్ళీ తన స్వగ్రామానికి చేరుకున్నాడు. కాని తన ఇల్లు ఎక్కడుందోకూడా గుర్తించలేక పొయ్యాడు. ఇల్లు అంతా పూర్తిగా శిధిలమైపోయి రేపోమాపో పడిపోతుందా

అనేటట్లుగాఉంది. ఆ పాడుబడిన కొంపలోకి అప్పుడప్పుడు ఆయనగారి సతీమణి వచ్చి కన్నీళ్ళుగార్చి పోతూఉండేది. ఈలాటి హృదయ విదారకపరిస్థితికూడా బాబాజీని విప్లవమార్గాన్నుంచి మరలించలేకపోయింది. దేశం దాశ్యశృంఖలా బద్ధమై పరితపిస్తూఉండగా విశ్రాంతికిది సమయం కాదనుకున్నాడు. తాము సాగించిన విప్లవం ఎందువల్ల ఓడిపోయిందో రష్యావిప్లవం ఎందువల్ల జయ ప్రదం అయిందో బాబాజీ గ్రహించాడు. విప్లవపంధా పూర్వకంటే ఇప్పుడింకా స్పష్టంగా కనిపిస్తూఉంది. "విప్లవకారుడు చచ్చిపోవచ్చు, కాని వృద్ధుడుమాత్రం గాడు" అని చెప్పిన బాబాజీ వెనుకంజ వేస్తాడా ? ఎర్రజెండాక్రింద ప్రజాసేవలో మళ్ళీ నిమగ్నుడయ్యాడు.

తన వెనకటి మిత్రులందరు ఎర్రజెండాక్రిందనే కలసి పనిచెయ్యడం చూశాడు, ఏ త్యాగదీక్షతో, ఏ ఆశయంకోసం గదర్‌పార్టీని నిర్మించారో ఆ త్యాగ దీక్ష, ఆ కార్యశక్తి, ఆ స్వాతంత్ర్యపిపాస నేడు ఎర్రజెండాక్రింద పనిజేస్తూఉన్న యువతీయువకుల్లో ప్రస్ఫుటమవుతూఉంది. తన వయస్సులో సగంకూడా ఉండీ ఉండని యువకులతో కలసిమెలసి బాబాజీ ముందడుగు వేస్తూన్నాడు. గదర్ వీరుల జీవితచరిత్రలో ఒక నూతనాధ్యాయం ప్రారంభమయింది.

కాంగ్రెస్ ఉద్యమంలోకూడా బాబాజీ తీవ్రంగా కృషిచేశాడు. రాష్ట్ర కమిటీకి సభ్యుడుగా ఎన్నుకోబడ్డాడు. అనేక కష్టనష్టాలకోర్చి లాఠీచార్జీని లక్ష్యంచేయ కుండా (అమృత్‌సర్ 1938) కాలికి ఒలపం కట్టుకొని గ్రామగ్రామానికి తిరిగి రైతుసంఘాన్ని నిర్మించాడు. అఖిలభారత రైతుమహాసభకు అధ్యక్షుడుగా ఎన్నుకోబడ్డాడు.

బాబాజ్వాలాసింగు అహోరాత్రాలూ గ్రామగ్రామానికి తిరిగి రాష్ట్రమంతటా రైతుసంఘాల్ని నిర్మించాడు. మూలమూలలనున్న పల్లెపల్లెకు బైటిప్రపంచంతో సంబంధంలేని నిలిబార్ జమీందారీ ఏరియాకు కూడా రైతుసంఘాన్ని వ్యాపింప జేశాడు. ప్రజాసేవలోనే మరణించాడు.

పంజాబ్ రైతు ఉద్యమ చరిత్రలో బాబాజ్వాలాసింగ్‌పేరు సువర్ణాక్ష రాలతో వ్రాయదగివుంటుంది.

ఫిరోజ్‌పూర్, కాలిసాస్టేటుకు చెందిన రైతుల్లో నూతనోత్సాహాన్ని పురికొల్పుతూ బాబారూర్‌సింగ్ అహర్నిశలూ తీవ్రంగా ప్రచారంచేశాడు అనేక స్థానిక రైతుపోరాటాల్ని నడిపాడు. మోగాతహసిల్‌లో ఉన్న ప్రజలందరి ప్రేమకు పాత్రుడై పంజాబీ ఎసెంబ్లీకి ఎన్నుకోబడ్డాడు

బాబాషేర్‌సింగ్ సహాయంతో ఒకవైపు సామ్రాజ్యవాదుల నిర్బంధవిధానాన్ని ఎదుర్కొంటూ బాబాకేసర్‌సింగ్ 'కీర్తి'ని ఒక ఆదర్శపత్రికగానడిపాడు ప్రతి రైతుపోరాటాన్ని బలపరుస్తూ 'కీర్తి' ప్రజలకు ఒక అమోఘమయిన ఆయుధంగా పనిజేసింది. 1939 లాహోరు మోర్చాలో బాబాకేసర్‌సింగ్ ప్రప్రథమంగా అరెస్టు చేయబడ్డాడు. ఈమహాపురుషుని జైలుజీవితం ఇప్పటికి 33 సంవత్సరాలకు పైగా ఉంది.

సాధుమూర్తి బాబావాసఖాసింగ్ నిరంతర ప్రజాసేవద్వారా సిక్కురైతుల హృదయాల్ని చూరగొన్నాడు. 'దేశభక్త పరివారసహాయకకమిటీ'ని స్థాపించి 1921 నుంచి ఖైదీల కుటుంబాలకు అన్నివిధాలా సహాయంజేస్తూ ఉండేవాడు.

కామగటామారూ వీరుడయిన బాబాగురుముఖ్‌సింగ్ పంజాబులో ఒక దివ్యపురుషుడులాగా భావించబడుతూ ఉన్నాడు. బాబాజీ అండమాన్ దీవుల్లో వీరోచితంగా పోరాడి పేరెన్నికగన్న మహాయోధుడు. ఆఫ్ఘనిస్తాన్‌లోకూడా కాంగ్రెసుఉద్యమాన్ని నిర్మించిన ఉత్తమదేశభక్తుడు. రష్యానుంచి తిరిగి ఇండియాకు వస్తూ పృథ్వీసింగ్‌తోపాటు కాబూలు జైలుకూపాల్ని ధిక్కరించి పరుగెత్తిపొయ్యే రైల్లోనుంచి దూకి తప్పించుకున్న - మేటిసాహసి. సమస్త సిక్కు ప్రజాసామాన్యంచే పూజింపబడే ఈ మహాత్ముడు నేటికీ సామ్రాజ్యవాదుల జైళ్ళల్లోనే పడి కుళ్ళిపోతూవున్నాడు. (14-2-46 న విడుదలయ్యాడు. అ.)

అండమాన్ పోరాటాల్లో అగ్రభాగమందుండి ప్రశంసనీయంగా పోరాడిన ధీరుడు పృథ్వీసింగ్. అరడజను మారుపేర్లతో ప్రభుత్వానికి చిక్కకుండా అనేకరాష్ట్రాల్లో స్వాతంత్ర్యజ్యోతిని వెలిగించిన స్వాతంత్ర్యయోధుడు.

బాబాషేర్‌సింగు, బాబాహర్నామ్‌సింగుటుండిలట్ బాబాలాల్‌సింగులు వయస్సులో వృద్ధులయినా యువకులుకూడా సిగ్గుపడేటట్లు నిరంతరం తీవ్రంగా కృషిచేసి అనేక స్వాతంత్ర్య ఉద్యమాలను నిర్మించిన మహాపురుషులు.

బాబాగుజర్‌సింగు, బాబాహర్‌నామ్‌సింగు బాబాహర్‌దిత్‌సింగులమ్మే మొదలయిన గదర్ వీరులుకూడా వయస్సులో వృద్ధులయినా యువకులకంటె ఎక్కువ ఉత్సాహంగా స్వాతంత్ర్య పోరాటాల్ని నడుపుతూ తమ తమ ప్రాంతాల్లో ప్రముఖ రాజకీయనాయకులుగా గుర్తింపబడ్డారు - రైతు సంఘాల్ని నిర్మించారు.

1914—15 కేసుల్లో అనేకమంది నాయకుల్ని ప్రభుత్వం జైల్లోబెట్టినా వీరి సహచరులు విప్లవజెండాయొక్క గౌరవప్రతిష్టలకు కళంకంరాకుండా కాపాడారు.

కర్మసింగుఛీమా అనేక రైతుపోరాటాల్లో పాల్గొన్నాడు. రెండవఅకాలీ కుట్రకేసులో (1925) ప్రధాన పాత్రవహించాడు. " దేశసేవక్ " అనే మొదటి సిక్కు విప్లవ పత్రికను నెలకొల్పి జయప్రదంగా నడిపాడు. కీర్తి కిసాన్ ఉద్యమాన్ని నిర్మించాడు. ఇతని సహచరుడయిన భాగ్‌సింగ్‌కూడా అకాలీ తిరుగుబాటుకు నాయత్వం వహించి సక్రమపద్ధతిలో దాన్ని జయప్రదంగా నడిపాడు. 1920 లో సిక్కులీగును స్థాపించాడు. 1930 లో చరిత్రప్రసిద్ధమయిన దోబా రైతు ఉద్యమాన్ని నిర్మించాడు. బాబా భగవాన్‌సింగ్ షహీద్‌జాథా ( మార్టియర్స్ స్క్వాడ్ ) కు నాయకత్వం వహించి (1925) కులమతద్వేషాలు తగవని దేశమంతటా విరివిగా ప్రచారంచేశాడు. ఐక్యతా ( హిందూ ముస్లిమ్ ) స్వాతంత్ర్య సందేశాల్ని దేశం నలుమూలలా ప్రతిధ్వనింప చేశాడు. షహీద్ జాథా చేసిన కృషిని దేశభక్తులంతా - పండిట్ నెహ్రూతో సహా - వేనోళ్ళకొనియాడారు. మొట్టమొదటి సారిగా సోషలిజాన్ని గురించి ఈదేశంలో ప్రచారం చేసిన ప్రముఖుల్లో సంతసింగు గండివింద్ పేరు అగ్రస్థానం అలంకరిస్తుంది.

ఊధమ్‌సింగు మర్‌హానా, విధాన్‌సింగ్ ఘుగా, కర్మసింగుధత్, మదన్‌సింగుగగా, ఇందర్‌సింగ్ సూర్‌సింగ్, కపూర్‌సింగ్ మోతీలు స్వాతంత్ర్య పోరాటంలో తమ అసువుల్ని సైతం త్యాగంజేసిన ఆదర్శ పురుషులు. తమ బొందిలో ప్రాణమున్నంతవరకు ఆస్వాతంత్ర్యాగ్నిచల్లారిపోకుండా ప్రజ్వలింపజేసి కర్తార్‌సింగు కీర్తికి వన్నె బెట్టారు. గదర్‌పార్టీ గౌరవ ప్రతిష్టల్ని కాపాడారు.

ఇలాటి వీరాగ్రేసరుల్ని, ఉత్తమ దేశభక్తుల్ని, త్యాగధనుల్ని చూచి, ప్రపంచంలోని ప్రతిస్వాతంత్రోద్యమం గర్విస్తుంది.

# కమ్యూనిస్టు పార్టీలోకి

1939 లో ద్వితీయ ప్రపంచ మహాయుద్ధం ప్రారంభమయింది. సామ్రాజ్యవాదుల దృష్టిలో ఈ బాబాలంతా పాత కేడీలే - ప్రమాదకరమయిన మనుష్యులే. తిరుగుబాటు సాగిన తర్వాత వారిజీవితంలో మొత్తం ఏనాలుగుమూడు సంవత్సరాలో జైలుబైట ఉండి ఉంటారు. 1940 అక్టోబరులోనే-మొదటి దాడిలోనే-ఈ విప్లవయోధులందరు అరెస్టుచేయబడ్డారు. ఇతరరైతునాయకులతోపాటు ప్రభుత్వం వీరినికూడా డియోలీకాన్‌సెంట్రేషన్ క్యాంపుకు పంపించింది. ఈ క్యాంపులోనే భారతకమ్యూనిస్టు పార్టీ నాయకులతో వీరికి బాగా పరిచయం ఏర్పడింది.

ఈ బాబాజీలందరు ఇదివరకే సోషలిజాన్ని అంగీకరించి ఎర్రజెండాక్రింద పనిచేస్తూ ఉన్నారు. డియోలీక్యాంపులో కమ్యూనిస్టు నాయకుల సాంగత్యంవల్ల కమ్యూనిస్టు సిద్ధాంతాల్ని క్షుణ్ణంగా చదివి అవగాహన చేసుకున్నారు. తమ గత చరిత్రనంతా మార్క్సిస్టులైనులో విమర్శచేసి దాని లోతుపాతుల్ని తెలుసుకున్నారు. స్వాతంత్ర్యపోరాటంలో తమ జీవితసర్వస్వం ధారవోసి పోరాడి ఆరితేరిన యోధులుగాబట్టి విప్లవకారులందరు మంచి క్రమశిక్షణ గలిగినపార్టీలో ఉండి సక్రమంగా పనిజేయాలిసిన ఆవశ్యకత యెంతఉందో అనేకమందియువకులకంటే ముందే గ్రహించారు. బానిసత్వంలో ఉండడంవల్ల తమకుజరిగిన ఘోరఅవమానాలే వారిని విప్లవపోరాటంలోకి దింపాయి. రష్యాలోజరిగిన నవంబర్ విప్లవ ఫలితంగా ప్రజలతో కలసి మెలసి పనిజేసి ప్రజల్నికూడా పోరాటంలోకి తీసుకరాగల్గినపుడే స్వాతంత్ర్యం సిద్ధిస్తుంది. అనే విషయం నేర్చుకున్నారు. 1930 లో మారుమూల ప్రదేశాలకుకూడా వెళ్ళి రైతుసంఘాల్ని స్థాపించారు. వారి ప్రజాసేవాతత్పరత, వారిదేశభక్తి, వారిస్వాతంత్ర్యదీక్ష, వారిహృదయాంతరాళంలో నిరంతరం ప్రజ్వరిల్లే ఆ విప్లవజ్వాల వారిని సహజంగా కమ్యూనిస్టుపార్టీవైపు ఆకర్షించాయి. సిరిసంపదలతో పాడిపంటలతో తులదూగే స్వతంత్రభారతదేశాన్ని నిర్మించడంకోసం విప్లవ కారులందరు భుజంభుజం గలిపి పోరాడవలసిన అవసరాన్ని గుర్తించే ఆ వృద్ధమూర్తులయిన విప్లవయోధులందరు కమ్యూ

నిస్టుపార్టీలో సభ్యులుగాచేరారు. గదర్‌పార్టీ నిర్మాత బాబా సోహన్‌సింగుభాక్నా పార్టీలో చేరుతూ "ఇది మా జీవిత పర్యంతపోరాటాల పర్యవసానం" అని చెప్పాడు.

డియోలీక్యాంపులో జరిగిన చరిత్రప్రసిద్ధమయిన నిరశనవ్రతంలో ఈ వృద్ధ బాబాజీలు నీళ్ళుకూడా త్రాగమని పట్టుబట్టారు. పార్టీచివరకు ఆర్డరిచ్చి వీరిని ఆపవలసి వచ్చింది. ఈ డియోలీ నరకాన్ని తర్వాత మూసివేశారు. కాని ఈ వీరుల్ని మాత్రం విడిచిపెట్టలేదు. పాతపగ సాధి చడమే ప్రభుత్వాశయం. ఖైదీలందరు విడుదల అయినతర్వాత చివరకెప్పుడో ఈ వృద్ధమూర్తులకు విముక్తి లభించింది. బాబారూర్‌సింగు ఇటీవల 1945 అక్టోబరులోనే విడుదల అయ్యాడు.

పృధ్వీసింగు అనేక సంవత్సరాలు అజ్ఞాతవాసంచేసి గాంధీజీ సలహా ప్రకారం 1939 లో ప్రభుత్వానికి వశమయ్యాడు. విడుదలై బైటకివచ్చినతర్వాత గాంధీగారి ఆశ్రమంలో కొంతకాలం గడిపాడు. 1942 లో మళ్ళీ అరెస్టు చేయ బడి 43 లో విడుదలయ్యాడు. తన సహచరులతోపాటు తానుకూడా పార్టీ జెండా క్రింద పార్టీ అభివృద్ధికై పాటుబడుతున్నాడు.

కాని విప్లవమూర్తి గురుముఖ్‌సింగు ఇంకా జైల్లోనే మ్రగ్గుతున్నాడు. కామ్రేడ్ గురుముఖ్‌సింగు సోవియట్ యూనియన్‌లో మార్క్సిజాన్ని అధ్య యనం చేశాడు. గదర్‌పార్టీ పునర్నిర్మాణానికి అమెరికాలో తీవ్రంగా కృషి చేశాడు. అజ్ఞాతవాసంలోఉండి అహోరాత్రాలు బ్రిటిష్ సామ్రాజ్యవాద నిర్మూలన ప్రయత్నంలో తన జీవితం ధారపోశాడు. కర్తార్‌సింగు రగుల్కొల్పిన ఆ విప్ల వాగ్ని చల్లారిపోకుండా చివరదాకా దాన్ని కాపాడుతూ వచ్చాడు. 1930 లో ప్రభుత్వం ఆయన్ని అరెస్టుచేసి లాహోరుకోటలో బంధించింది. ఖైదీల్ని హింసించడంలో దీనికిమించిన బందిఖానా ఇండియాలో మరొకటిలేదు. నవ యువకుడుగా గదర్ ఉద్యమంలో పాల్గొన్నాడు. ఈ రోజు వృద్ధుడైపొయ్యాడు. వెంట్రుకలు నరిసిపోయాయి. కాని ఉత్సాహంమాత్రం సన్నగిలలేదు. పోలీసు లకు, సి. ఐ. డి. లకు ఈ వీరుని పేరుజెప్పితే హడల్. ఇతనిమీద కొత్త కేసులు బనాయించడానికి పోలీసులు ఎన్నో కుట్రలు బన్నారు.

కాని, మళ్ళీ క్రొత్త విచారణ ప్రారంభించేందుకు ప్రభుత్వానికి కలేజా లేకపోయింది. ఈ దేశంలోనేకాకుండా ఇతరదేశాల్లోకూడా అల్లరిపాలవుతాననే భయంతో ఆ ప్రయత్నాన్ని విరమించి మళ్ళీ అండమానులకే పంపింది. బాబా గురుముఖ్‌సింగ్ మళ్ళీ నిరశనవ్రతాన్ని అవలంబించి అండమాన్‌దీవుల్ని మరొక సారి మూయించివేశాడు. అప్పటినుంచి నేటివరకు పంజాబుజైల్లోబడి అనేక విధములయిన బాధ లనుభవిస్తూ ఉన్నాడు.

ఇప్పటికి 17 సంవత్సరాలనుంచి జైలుశిక్ష అనుభవిస్తూఉన్నా తిండి దొంగల ప్రభుత్వం అయిన యూనియనిస్టు మంత్రివర్గం ఈ వీరసింహాన్ని విడుదల జేయ నిరాకరిస్తూఉంది.

బాబా సూచాసింగ్‌కూడా 13 సంవత్సరాలనుంచి నేటికీ హజారీబాగ్ జైల్లోపడి మ్రగ్గుతూ ఉన్నాడు.

సంగ్రహంగా ఇదీ గదర్‌పార్టీ చరిత్ర. మహా వీరుడయిన కర్తార్‌సింగ్ కీర్తిని ఇనుమడింపజేస్తూ ఇంతటి వృద్ధాప్యంలోకూడా నేటికీ స్వాతంత్ర్య పోరాటంలో ముందుండి పోరాడుతూఉన్న ఈ విప్లవయోధులు సిక్కు ప్రజా సామాన్యంలో దివ్యపురుషుల్లాగా భావింపబడుతూఉన్నారు. 22 సంవత్సరాల నుంచి 33 సంవత్సరాల వీరి జీవితం అండమాన్‌దీవుల్లోను, ఇండియాలోని కటికచీకటి కొట్లల్లోను గడచిపోయింది. స్వరాజ్య సంపాదనార్థం తమ సర్వస్వం అర్పించారు. రక్తం ధారవోశారు.

గదర్‌పార్టీచరిత్ర 40 కోట్ల భారతీయుల అవిచ్ఛిన్నమయిన స్వాతంత్ర్య కాంక్షయొక్క ప్రతిబింబం. ఈ లాంటి విప్లవయోధుల్నిజూచి ఏ దేశం గర్వించకుండా ఉంటుంది?

# సర్దార్ సోహన్‌సింగ్ జోష్

సోహన్‌సింగ్‌జోష్ 1937 పంజాబురాష్ట్ర ఎన్నికల్లో కమ్యూనిస్టు అభ్యర్థిగా పోటీచేశాడు. ఈయన ప్రత్యర్థి ఒక యూనియనిస్టు, భూస్వామి. ప్రఖ్యాతిచెందిన ప్రభుత్వ గులాము. నీళ్ళు పారబోసినట్లు డబ్బు ఖర్చుపెట్టాడు.

పోలీసులు, ప్రభుత్వోద్యోగులు అండగా నిలిచారు. కాని ఓడిపోయాడు. సర్దార్ అఖండవిజయం పొందాడు.

అసెంబ్లీలో యూనియనిస్టు ప్రభుత్వ చర్యల్ని బట్టబయలు చెయ్యటం వల్ల ప్రభుత్వానికి ఈయనంటే విపరీతమైన భయం. చివరికి 1940 జూనులో డిఫెన్సు చట్టంక్రింద, విచారణలేకుండా జైలులో బంధించి ప్రభుత్వాధికారులు సంతృప్తి పడ్డారు.

1893 లో జన్మించాడు. శైశవంనుంచీ దారిద్ర్యంతో పోరాడిజీవించాడు. విద్యుచ్ఛక్తిపరిశ్రమలో, 1914 ప్రపంచ యుద్ధకాలంలో బొంబాయి ప్రభుత్వపు సెన్సార్ డిపార్టుమెంటులో, ఉపాధ్యాయ వృత్తిలోపనిచేశాడు. అకాలీ ఉద్యమం ఉచ్ఛదశలో వున్నప్పుడు రాజకీయాల్లో ప్రవేశించాడు.

ఈయన ఉద్రేకపూరితమైన ఉపన్యాసాలు విన్న ప్రజలు "జోష్" అనే బిరుదునిచ్చారు. ప్రభుత్వం రెండుసార్లు జైల్లో త్రోసింది. ప్రజాభిమానం గాఢమైనది. కొద్దికాలంలోనే శిరోమణి అకాలీ దళానికి ప్రధాన కార్యదర్శిగా ఎన్నుకోబడ్డాడు ఈ కారణంగా మూడేళ్ళు కారాగార వాసమనుభవించాడు. అప్పటికి 18 ఏండ్లవయస్సులోవున్న భగత్‌సింగ్‌తోపాటు, యువజన నాయకుల్లో ముఖ్యుడైనాడు. ఈకాలంలో భాయ్ సంతోక్‌సింగ్ ద్వారా సామ్యవాద విజ్ఞానప్రభావం ఈ యువనాయకుల్ని చైతన్య పరిచింది సోషలిస్టు ఉద్యమం తరఫున ప్రకటించిన 'కీర్తి' పత్రికకు భగత్‌సింగ్‌తోపాటు తనూ సంపాదకత్వం వహించాడు.

భగత్‌సింగు ఒక యువజన సంస్థను స్థాపించాడు. భారత స్వాతంత్ర్య సంపాదన దానిలక్ష్యం. ఈ "నవజవాన్ భారతసభ" రెండవ వార్షిక సమావేశానికి సర్దార్ అధ్యక్షత వహించాడు.

1929 లో సుప్రసిద్ధమైన మీరట్ కుట్రకేసు జరిగింది. సోహన్‌సింగును కూడా అరెస్టుజేశారు. మూడేళ్లు విచారణ జరిగిన తర్వాత ఏడేళ్లు కఠినశిక్ష విధించబడ్డాడు. కాని బైటిప్రజల ఆందోళన ఫలితంగా, హైకోర్టు అప్పీలులో శిక్షను ఒక సంవత్సరానికి తగ్గించారు. 1933 నవంబరులో విడుదలైనాడు. తిరిగి ప్రజావుద్యమాలకు నాయకత్వం వహించాడు. ప్రజాహృదయంలో ఈయనకెంత ఉత్తమ స్థానమున్నదో 1937 ఎన్నికల్లోని అఖండవిజయమే నిరూపిం

చింది. 1939 లో పంజాబురాష్ట్ర కాంగ్రెసుసంఘ ప్రధాన కార్యదర్శిగా ఎన్నుకున్నారు. ప్రభుత్వం మళ్ళీ 1940 లో దిబ్బైకాచేసి రెండేళ్ళవరకూ విడుదల చెయ్యలేదు.

శాసనసభలో ఈయన చూపిన శక్తిసామర్థ్యాలు మెచ్చనివారు లేరు. ప్రజా ఉద్యమాల్లో ఈయన నిర్మల కార్యదీక్ష, వినయశీలత శత్రువుల్నిగూడా నిర్ఘాంత పరిచాయి.

# తేజసింగ్ స్వతంత్ర

భారత దేశంలోనూ, విదేశాల్లోనూ కూడ స్వాతంత్ర్య సమరాలు సాగించిన పంజాబు విప్లవకారుల్లో సైతం తేజసింగ్‌స్వతంత్రలాగ వీరోచిత ఘటనలే జీవితంగాగల విప్లవవీరులు అరుదు.

1921-22 లో ఆయన రాజకీయ జీవితం ప్రారంభమైంది. ప్రథమ ప్రపంచ యుద్ధం ముగిశాక, బ్రిటిష్ ప్రభుత్వానికీ-ప్రజలకూ మధ్య అనేకపోరాటాలు జరుగుతున్నరోజులవి. ప్రజల్లో జాతీయ చైతన్యం హెచ్చయింది. ప్రభుత్వానికి దాసోహమంటూ లంచగొండులయిఉన్న మహంతుల చేతుల్లోనుంచి గురుద్వారాలను లాక్కోవాలనీ, ప్రజాతంత్ర పద్ధతులపై గురుద్వారాలను నడపాలనీ సిక్కులలో బ్రహ్మాండమయిన ఉద్యమం ప్రారంభమైంది.

అదే అకాలీ ఉద్యమం. సిక్కులలో మెరికల్లాంటి వాళ్ళంతా యీ ఉద్యమంలో పాల్గొన్నారు.

బ్రిటిష్ ప్రభుత్వం మద్దతు యివ్వటం మూలంగా ఆ మహంతులు ప్రజాందోళనకు లొంగలేదు. సిక్కు ప్రజల్లో పట్టుదల యెక్కువయింది. చాల కాలం పోరాటం జరిగింది. ఆ పోరాటంలో వేలకొలది సిక్కులను జైళ్ళలో బంధించారు. వందలకొలది మందిని లాఠీలతో చావమోదారు. ఇంకెంతో మందిని తుపాకులతో కాల్చారు.

సంవత్సరాల తరబడి పోరాటం సాగింది. పోరాటాన్ని నడుపుతున్న గురుద్వార కమిటీలను ప్రభుత్వం అక్రమ సంస్థలుగా నిషేధించింది. కడపటికి

'గురుద్వార ఆక్టు' లోని నిబంధనల ప్రకారం ప్రభుత్వం లొంగక తప్పలేదు. గురుద్వారాల నన్నిటినీ ప్రజాసామ్య పద్ధతులపై నడపటానికి అంగీకరించారు.

ఈ పోరాట చరిత్ర అంతా వీరోచిత ఘటనలతోనూ, మహాపట్టుదలతో సాగించిన కార్యకలాపాలతోనూ, నిండివుంది.

సోమేందర్‌సింగుకు అప్పుడు యిరవైయేండ్లు. ఈ పోరాటంలో ప్రధాన పాత్ర వహించాడు. అకాలీ ఉద్యమాన్ని నడిపించిన శిరోమణి గురుద్వార ప్రబంధక సంఘంలోకి ఎన్నుకోబడ్డ వాళ్ళందరిలోనూ ఈయనే చిన్నవాడు. ఈయనకు 'తేజసింగు స్వతంత్ర' అనే పేరురావటానికి కూడ చాల కథ ఉంది.

'తేజ' అనేగురుద్వారపు మహంతు పరమనీచుడు. విపరీతపులంచగొండి, మహాక్రూరుడుకూడా. ఇతగాడు ఒకబడితెల ముఠాను తయారు చేశాడు. తనగురుద్వారంవద్ద సత్యాగ్రహంజేస్తున్న దళాలను బడితెలతో చావమోదించేవాడు.

ఒక చిన్న అకాలీదళం 56 మంది వున్నారు. సోమేంద్రసింగ్ ఈ దళానికి నాయకత్వం వహించాడు. ఈ చిన్నదళంతోనే గురుద్వారం చుట్టూ కాపలావున్న 500 మంది బడితెలముఠా కూడ తెల్లమొగాలు వేసేటట్టుగా తెల్లవారుఝామున చటుక్కున గురుద్వారాన్ని ఆక్రమించాడు. పోలీసులు వచ్చారు. గురుద్వారాన్ని ఖాళీచేయక పోతే కాల్చి చంపుతామన్నారు. అకాలీదళం లెక్కచేయలేదు. పోలీసుల్ని పో, పొమ్మన్నారు. పోలీసులు వెనక్కివెళ్ళిపోయారు. కోర్టుల్లో కేసులు పెట్టారు.

"ఊరూరా సోమేంద్రసింగ్ పేరు మోగిపోతోంది. ఎక్కడ చూచినా సోమేంద్రసింగ్ చేసిన సాహసకార్యాలను గురించీ, చాకచక్యాన్ని గురించీ కొనియాడు తుండేవాళ్ళు. ఆ నాటినుంచే 'తేజసింగ్' అనే పేరువచ్చింది.

ఉద్యమాన్ని మరింతజోరుగానూ, తీవ్రంగానూ, సాగించడంకోసం తేజసింగు వాలంటీరుదళం స్థాపించాడు. ఆ దళంలోని వాళ్ళంతా సంసారపు గొడవలేకుండా స్వతంత్రులుగా వుండాలని నియమం ఏర్పరిచాడు. ఆస్థి పాస్తుల వ్యవహారాలకు స్వస్తిచెప్పమన్నాడు. కఠినమైన క్రమశిక్షణకు లోబడివుండాలన్నాడు.

తేజసింగ్ స్వతంత్ర రాజకీయజీవితం ప్రారంభమైంది. పంజాబులోని ప్రధాన నాయకుల్లో ఒకడయ్యాడు.

ఆఫ్ఘనిస్థాన్‌లోవున్న సిక్కులలో సంఘశక్తిని నిర్మించుటకై 1922లో కాబూల్‌లో వున్నాడు. అక్కడ సర్దార్ ఉద్దామసింగుకూ-తేజసింగుకూ సన్నిహిత సంబంధమేర్పడింది. అది మొదలుకొని భారతదేశం బానిసత్వంలో మ్రగ్గుచుండగా-గురుద్వారాలను మహంతుల చేతుల్లోనుండి విముక్తిచేయటమే చాలదని గుర్తించాడు తేజసింగుస్వతంత్ర.

ఇండియాకు తిరిగివచ్చాక ఉద్దామసింగుకూ-తనకూ జరిగిన సంభాషణలను గురించి తరచి తరచి ఆలోచించాడు భారతదేశానికి స్వాతంత్ర్యం సమకూరే వరకూ నిరంతరకృషి చేయాలని నిర్ణయించుకున్నాడు.

ఆయన తరువాత జీవితంలోని ఘటనలను గురించి వ్రాయాలంటే పేజీలకు పేజీలు నిండి పోతాయి. సైనిక శిక్షణకోసం విదేశాలకువెళ్ళాడు. టర్కిష్ మిలటరీ ఎకాడమీలో అయిదేళ్ళు తర్ఫీదు పొందాడు. ఉన్నత పరీక్షల్లో ఉత్తీర్ణుడయ్యాడు. టర్కీలో 'పెద్దపులి' అని ప్రసిద్ధిచెందిన జనరల్ ఫక్రీపాషా మన తేజసింగును ఎంతో మెచ్చుకొనేవాడు. తన కన్నబిడ్డలాగ చూచుకొనేవాడు.

మిలిటరీ శిక్షణ అయిపోయింది. అమెరికా వెళ్ళాడు. గదర్‌పార్టీని పునర్నిర్మించాడు. అమెరికా ప్రభుత్వం తన దేశంనుంచి వెళ్ళిపొమ్మంది. పనామా, బ్రెజిల్ మొదలయిన అమెరికా ఖండంలోని మధ్య దేశాల్లోనూ, దక్షిణదేశాల్లోనూ, నివసిస్తున్న భారతీయులను సంఘటిత పర్చుటకై కృషిచేశాడు. ఎక్కడకు వెళ్ళినా సరే ఏనాడో మాతృదేశాన్ని విడిచిపోయిన భారతీయుల్లోనూతన జీవాన్ని, రాజకీయచైతన్యాన్ని రేకెత్తించాడు. 1933 లో సోవియట్ వెళ్ళాడు.

భారతదేశానికి వచ్చినతరువాత 18 నెలలపాటు సాధువేషంతో ప్రజల్లో స్వాతంత్ర్య కాంక్షను రేకెత్తించి సంఘటిత పర్చుటకై తీవ్రంగా కృషిచేశాడు. 1936 లో తేజసింగ్ స్వతంత్రను అరెస్టుచేశారు. ఆరేళ్ళపాటు 'రాజబంధువు'గా జైల్లో డిటెయిన్ చేశారు.

1942 లో విడుదలయ్యాడు. మళ్ళీ ప్రజలమధ్య నిలబడ్డాడు. ప్రజల్ని సంఘటిత పరుస్తూ ప్రజలకొరకయి పోరాటాలు నడుపుతున్నాడు. పరాయి ప్రభుత్వపు దాస్యశృంఖలాలనుంచి పెద్ద గురుద్వారమయిన-భారతదేశాన్ని- విముక్తి చేయుటకై ప్రజలను స్వాతంత్ర్య సమరానికి సమాయత్త పరుస్తున్నాడు.

# బాబా రూర్ సింగు

పంజాబులో 1937 ఎన్నికల్లో. ఒక అరవై అరేండ్లవృద్ధుడు, బీద రైతు, అసెంబ్లీకి అభ్యర్థిగా నిలబడాలని ప్రజలంతా ఒత్తిడి చేశారు. ఆయన వద్ద డబ్బులేదు. గొప్ప గొప్ప వాళ్ళతో చుట్టరికాలులేవు. కాని, ఎంతగాఢంగా ప్రజల ప్రేమ గౌరవాలు పొందాడంటే ఏ జమీందారుకుగూడా ఆయన నెదు ర్కోటానికి గుండెలేక పోయింది. మోగా సిక్కు నియోజకవర్గంనుంచి పోటీ లేకుండా ఎన్నుకోబడ్డాడు. ఆయనే బాబారూర్‌సింగు.

ఈయన 25 ఏండ్ల యుక్తవయస్సులోనే బ్రతుకు తెరువుకోసం భారత దేశాన్ని విడిచిపెట్టవలసి వచ్చింది. ఆస్ట్రేలియా, న్యూజిలాండు, మొదలయిన దేశాల్లో కార్మికుడుగా పనిచేసి చివరికి అమెరికా చేరుకున్నాడు. అమెరికాలో అనేకమంది సిక్కులు ఫ్యాక్టరీల్లో, పొలాల్లో కూలిచేసిజీవిస్తున్నారు. స్వేచ్ఛకూ బానిసత్వానికీ వున్న తేడా గ్రహించారు. మాతృదేశ విముక్తికోసం తహ తహ పడసాగారు. దీనిఫలితమే గదర్‌పార్టీ అనే విప్లవసంస్థ. సాయుధపోరాటం ద్వారా స్వాతంత్ర్యం సాధించడమే వీరి ఆశయం. బాబా రూర్‌సింగ్ ఈసంస్థ మొదటి సభ్యుల్లో ఒకడు విరాళాలు, ఆయుధాలు ప్రోగుచేసి, 1914 లో యీ యోధుల మొదటిజట్టు భారతదేశానికి బయలు దేరినప్పుడు రూర్‌సింగుకూడా అందులో వున్నాడు.

భారతదేశంలో, ప్రభుత్వ సైనికులతో జరిగిన పోరాటాల్లో అనేకమంది తుపాకి కాల్పులకు గురియైనారు. అనేకమంది ఉరితీయబడ్డారు. గదర్‌పార్టీ స్వాతంత్ర్యలక్ష్యాన్ని జేరుకోలేక పోయినప్పటికీ ఈ విప్లవ వీరులు భారత స్వాతంత్ర్య పోరాట చరిత్రను తమరక్తంతో లిఖించారు. బాబా రూర్‌సింగుకు యావజ్జీవశిక్ష విధించారు. 14 ఏండ్లు అండమాన్ నరకంలో చావు బ్రతుకుల పోరాటం గావించి 1929 లో విడుదలై వచ్చాడు.

ఏండ్లతరబడి దుర్భరబాధలనుభవించిన ఫలితంగా ఈయన దేహము దెబ్బతిన్నది. ఇచ్ఛాశక్తి మాత్రం రవ్వంతైనా తగ్గలేదు. సహచరులంతా సోష లిస్టు సాహిత్య ప్రభావంతో రైతుఉద్యమాలు నిర్మిస్తుంటే ఈయనగూడ కలిసి

కృషిచేశాడు. త్వరలో పంజాబునాయకుడుగా ప్రసిద్ధిపొందాడు రాజకీయ ఖైదీల కుటుంబసంరక్షణకమిటీకి కార్యదర్శిగా పనిచేసి అసమానమైన గౌరవప్రతిష్టలు సంపాదించాడు అందుచేత, 1937 అసెంబ్లీ ఎన్నికల్లో పోటీలేకుండా ఎన్నుకోబడటంలో ఆశ్చర్యమేమీలేదు. ప్రజాసౌఖ్యంకోసం, లోపల అసెంబ్లీలోనూ, బైట రైతుఉద్యమంలోనూ నిరంతర కృషిచేశాడు. కాశ్మీరు సంస్థానంలో రైతులపోరాటాన్ని స్వయంగా నాయకత్వం వహించి నడిపాడు. తరువాత పంజాబు కిసాన్ సభకు అధ్యక్షుడుగా ఎన్నుకోబడ్డాడు. 1939 లో స్వగ్రామం లోనే "చౌకీదారు పన్ను"కు వ్యతిరేకంగా సత్యాగ్రహం నడిపినప్పుడు వందల కొలది ప్రజలువచ్చి పాల్గొన్నారు.

ఇటువంటి దేశభక్తుల్ని ప్రభుత్వం సహించలేను. 1939 జూనులో డిటైన్ చేసి, ఐదేళ్ళతర్వాత మొన్ననే విడుదల చేశారు. దియోలీ కారాగారంలో వున్నప్పుడే కమ్యూనిస్టుల్ని, కీర్తిసంఘసభ్యుల్ని సమాయత్తపరచి పంజాబులో ఐక్యకమ్యూనిస్టు ఉద్యమాన్ని నెలకొల్పాడు దియోలీ జైల్లో వున్నప్పుడే కృశావస్థలో వుండిగూడ ఆ నిరశనవ్రతంలో పాల్గొన్నారు. మంచినీళ్ళుగూడ నిరాకరించాడు. కాని, పార్టీ ఆజ్ఞ ఒక్కటే ఈయనపట్టుదలనుసడలించి, ప్రాణం రక్షించగలిగింది. డిటెన్యూలందర్ని విడుదలచేస్తున్న పంజాబు ప్రభుత్వము ఈయన భార్య మరణావస్థలో వున్నప్పటికీ బంధించివుంచింది. ఈయనభార్య మరణించిన తర్వాత మొన్న అక్టోబరులో విడుదలచేశారు. అప్పటినుండి గ్రామ గ్రామానికీ సంచారంచేస్తూ గడపగడపకూ స్వాతంత్ర్య సందేశం విన్పిస్తున్నాడు.

## బాబా గురుముఖ్ సింగు

పదమూడు సంవత్సరాలు ప్రవాసములోను పదిహేడు సంవత్సరాలనుండి జైలులో మ్రగ్గుచున్నాడు.

యూనియనిస్టు మంత్రివర్గం పంజాబు కేసరిని లాయల్‌పూరు జైలులో నిర్బంధించివుంచింది. ఇతనిపేరు బాబా గురుముఖసింగు. తల నెరసిపోయింది. కాళ్లు, చేతులలో బల ముడిగిపోయింది. పండుపండిపోయాడు కాని పిరికిపంద లైన యూనియనిస్టులను రూపుమాపుటకు ఆయనలో యిప్పుడుకూడా మంచి

వుత్సాహముంది. అందుచే ఖిజర్ హైయత్ ఖాన్ యూనియనిస్టు ప్రభుత్వం బాబా గురుముఖసింగును పదిహేడు సంవత్సరాలు జైలులో నిర్బంధించివుంచినప్పటికి కూడా విడుదల చేయుటకు నిరాకరించుతూంది.

బాబా గురుముఖసింగును విడుదల జేసేయెడల అయన ఒక్క పిలుపుతోనే మధ్య పంజాబులోని సిక్కు రైతులందరు లేచి, యూనియనిస్టులను, వారి తొత్తులగు అకాలీనాయకుల పీఠాన్ని తలక్రిందులు చేసివేస్తారని యూనియనిస్టులు బాగా యెరుగుదురు. అందుచే యూనియనిస్టు ప్రభుత్వం బాబాజీని వదల నిరాకరించుతూంది. ఎన్నికలలో నిలబడుటకు ఆయనకు అవకాశం ఇచ్చుటలేదు.

## ఆయన ఎవరితో వున్నాడు ?

ఇండియాలో లీగు "స్వాతంత్ర్యం" "విప్లవం" అని పెదవులు కదల్చుటయే ప్రమాదకరమని భావించే సమయంలో, మన జాతీయోద్యమపు ఇప్పుడున్న నాయకులు తమ యావత్ శక్తిని బ్రిటిషు ప్రభుత్వానికి సహాయం నెరపుటలో వినియోగించే సమయంలో, 1914 లో బాబా గురుముఖసింగు లాహోరు కోటలో నిర్బంధింపబడి వురిత్రాడును కౌగిలించుకొనుటకు యెదురు జూస్తూ వున్నాడు. విప్లవోద్యమంలో పాల్గొని ముప్ఫై సంవత్సరాలు గడిచాయి. అందులో పదిహేడు సంవత్సరాలు జైలులోను, పదమూడు సంవత్సరాలు ప్రవాసంలోను, లేక పోలీసులనుండి తప్పించుకొంటూ అటూ యిటూ తిరుగుటలోనూ గడిచాయి.

కాని నేడు ఎన్నికల తరుణం వచ్చింది. ఇందులో చాలామందికి అన్నీ తలక్రిందులుగానే కవిపిస్తున్నాయి. అకాలీ నాయకులు బాబాజీ సహచరులకు వ్యతిరేకంగా తుచ్ఛమైన నీచప్రచారం గావించుతున్నారు. జైలుగోడలమధ్య నిర్బంధింపబడియున్న ఈవృద్ధసింహం ప్రేమించే కమ్యూనిస్టుపార్టీ 1942నుండి బ్రిటీషువారితో కలసి పోయిందని పండిట్ నెహ్రూ అంటున్నాడు.

## కామగాటామారు ఓడలో

బాబా గురుముఖసింగు లూధియానా జిల్లాలో ఒక బీదకుటుంబంలో జన్మించాడు. ఆ కుటుంబానికివున్న ఆస్తి ఆ రెకరాలు. కుటుంబం చాలా పెద్దది దీంతో యిల్లు గడవటమే కష్టంగావుంది. అంచేత గురుముఖసింగు కాస్త పె

వాడు కాగానే నౌకరీకోసం దేశంమీద బయలుదేరాడు. ఆ రోజులలో మన దేశంనుంచి చాలామంది పని పాటలకోసం కెనడా, అమెరికాలకు వెళ్ళుతూ ఉండేవారు. కాని కెనడా ప్రభుత్వానికి యిది రుచించక తన దేశానికి భారతీయులు వలస రాకూడదని నిషేధం పెట్టింది. దీనిమీద ఆందోళన సాగేసరికి యిండియానుండి కెనడాకు నేరుగా ఓడల రాకపోకలు వుండనంతకాలం భారతీయులను మా దేశంలోకి రానివ్వమని ప్రకటించింది.

అయినాసరే బాబా గురుముఖసింగు నాయకత్వంక్రింద నాలుగవందల మంది భారతీయులు 'కామగాటామారు' అనే ఒక జపాను ఓడను కిరాయికి తీసుకొని కెనడాకు బయలుదేరారు.

'కామగాటామారు' విషయం అందరికీ తెలిసేవుంటుంది. కెనడా ప్రభుత్వం భారతీయులను ఓడనుండి దిగనివ్వలేదు. నవయువకులైన యీ భారత యాత్రీకులు తమ ప్రాణాల్ని ఒడ్డియైనాసరే అవమానానికి బదులు తీర్చుకోవాలనుకున్నారు. గురముఖసింగు దీనికి నాయకత్వం వహించాడు.

కెనడాలోని భారతీయ కార్మికులు కెనడా కార్మికులుకూడ 'కామగాటామారు' లోని యాత్రికులకు సానుభూతిగా హర్తాళం జరిపారు. పెద్ద వూరేగింపులు బయలుదేర దీశారు. కాని, ఆఖరకు 'కామగాటామారు' కలకత్తాకు తిరిగి రావలసి వచ్చింది.

ఈ ఓడలో వున్నది మామూలు కార్మికులు, రైతులు కారనిన్నీ, బ్రిటిషు ప్రభుత్వాన్ని తొలగించనంతవరకూ విశ్రాంతి తీసుకోమని ప్రతిజ్ఞగావించిన విప్లవసైనికులు యిందులో వున్నారనీ బ్రిటిషుప్రభుత్వం గ్రహించింది. సాయుధపాణులైన పోలీసులూ, సైనికులూ యిండ్లకు తిరిగివస్తున్న యీ యాత్రికులకు కలకత్తా రేవులో స్వాగతమిచ్చారు. రెండువైపులా తీవ్రమైన యుద్ధం జరిగింది. చాలామంది యాత్రికులు తప్పించుకు పారిపోయారు. మిగతావారిని పట్టుకొని కొన్నిరోజులపాటు జైల్లో నిర్బంధించారు.

ఈ నిర్బంధాలతో గురుముఖసింగు విప్లవజీవితం ప్రారంభమయ్యింది. కొన్ని రోజులు జైల్లో వుంచిన తరువాత పోలీసులు ఆయనను స్వగ్రామం తీసుకుపోయి, ఊరుదాటి బయటకు రాకూడదని నిర్బంధించారు.

## ద్వీపాంతరవాసశిక్ష

ఈ మధ్యకాలంలో అమెరికాలో భారతీయులు గదర్‌పార్టీని స్థాపించారు. అక్కడినుండి యువకులు వందలకొలదిగా ఇండియాకు వచ్చి, భారతీయ సైన్యాలలో తిరుగుబాటులు లేవదీయుటకు ప్రయత్నిస్తున్నారు. ఈ గదర్‌పార్టీ నాయకులను కొంతమందిని గురుముఖసింగు కలుసుకున్నాడు. గదర్ పార్టీవారు యీయనకు బాంబులు మొదలైనవి చేయించేపని వప్పగించారు. ఒకరోజు రాత్రి గురుముఖసింగు తన గ్రామంనుండి పారిపోయాడు.

కాని, గదర్‌పార్టీ విషయంలో ప్రభుత్వం జాగ్రత్తగానే వుంది. పంజాబులో అరెస్టులు విరివిగా జరుగుతున్నాయి అంటురుకు 65 గురిపై మొదటి లాహోరు కుట్రకేసు ( 1914 - 15 ) నడిపారు. అందులో యేడుగురికి ఉరిశిక్ష, ముప్పై యెనమండుగురికి ద్వీపాంతరవాస శిక్ష విధించారు. ఈ ముప్పై యెనమండుగురిలో గురుముఖసింగు, గదర్‌పార్టీలోని దాదాపు ప్రముఖ నాయకులందరూ వున్నారు. వారిలో అనేకులు - సర్దార్ పృధ్వీసింగు, బాబా కేసరిసింగు, బాబా రూర్‌సింగ్ మొదలైనవారు నేడు కమ్యూనిస్టుపార్టీ తరఫున పంజాబు అసెంబ్లీ ఎన్నికలలో నిలబడుతున్నారు.

గురుముఖసింగు 1922 వరకు అండమాను జైలులో ఉన్నాడు. ఆ రోజులలో అండమాను నరకం కన్నా భయంకరంగా వుండేది. కాని అక్కడి జైలుఅధికారుల నిరంకుశ ప్రవర్తనల నెదుర్కోవటంలో గురుముఖసింగు అందరికన్నా ముందుండేవాడని ఆయన సహచరులు ఇప్పటికీ ఎంతో గర్వంగా చెప్పుకుంటారు.

1922 లో ఈ ప్రమాద కరమయిన ఖైదీని ప్రభుత్వం ఇండియాకు పంపించి వేసింది. ఇన్నాళ్ళనుంచి సమయంకోసం పొంచికూర్చున్న గురుముఖసింగుకు భలే అవకాశం దొరికింది. రాజమండ్రి జైలుకు తీసుకొని వెళ్ళేటప్పుడు రైల్లోనుంచి దూకి, పరారై పోయాడు.

## ఆఫ్గనిస్థానంలో

ఈ సమయంలో పూర్వం గదర్‌పార్టీకి నాయకులుగా ఉన్నవారంతా సిక్కు గురు ద్వారాలను మహంతులనుండి వశపరచుకొంటానికై అకాలీ ఉద్య

మాన్ని నడుపుతున్నారు. ఆ నాయకులు గురుముఖసింగుకు ఇండియాలో వుండే దానికంటె కాబూలుకు వెళ్ళిపోవడం మంచిదని సలహా యిచ్చారు. అకాలీ నాయకుడు తేజస్సింగుస్వతంత్ర బాబాజీని కాబూలుదాకా పంపించి వచ్చాడు.

గురుముఖసింగు కాబూలులో సంతోషసింగు, భాయీ రతన్‌సింగులను కలుసుకొన్నాడు. భాయీ రతన్‌సింగు అప్పుడు సోవియట్ రష్యాలో గదర్ పార్టీ ప్రతినిధిగా వున్నాడు. వీరందరూ కలసి ఒక ప్లాను తయారుజేశారు. ఆ ప్లాను ప్రకారం పంజాబువెళ్ళి "కీర్తి" అనే విప్లవకార పత్రికను ప్రకటించేపనిని సంతోషసింగుకు వప్పగించారు. భాయీ రతన్‌సింగు డబ్బు వసూలుచేయుటకు అమెరికా వెళ్ళాడు. గురుముఖసింగు కాబూలులోనే వుండి భారతీయ విప్లవ కారులకు సహాయం జేస్తున్నాడు.

గురుముఖసింగు 1928 వరకు కాబూలులోనే వున్నాడు. అప్పుడప్పుడు మారువేషాలతో పంజాబుకు వస్తూపోతూ ఉండేవాడు. వుద్యమస్థాయినీ, పరిస్థితుల్నీ చూచి పోవటంకోసం. తన అనుచరులను యెల్లప్పుడూ దృఢంగాను, మంచి క్రమశిక్షణతోనూ వుండమంటుండేవాడు. యెవరైనా దారి తప్పినట్టుంటే గురుముఖసింగు వాళ్ళను గద్దించి - "యిందుకొరకేనా నీవు సర్వం త్యాగం జేసి విప్లవకారుడవైంది? యీ విధంగానేనా నీవు భారతదేశాన్ని విముక్తిపరచి నీ ప్రతిజ్ఞను చెల్లించుకునేది?" అనేవాడు.

గురుముఖసింగు 1928 లో అమెరికా వెళ్లాడు. కాని, అచ్చట బ్రిటీషు ఏజెంట్లు (సి.ఐ.డి. లు) వుండనివ్వలేదు. 1932 లో బ్రిటిషు ఏజెంటు బచ్చా సక్కా ఆఫ్ఘనిస్థాన్ రాజ్యపరిపాలనకు వచ్చినప్పుడు గురుముఖసింగును అక్కడి నుండికూడా వెళ్ళగొట్టాడు. అప్పుడు గురుముఖసింగు సోవియట్ రష్యాకు వెళ్ళాడు. అక్కడ చాలామంది భారతీయ విప్లవకారులు రాజకీయశిక్షణ పొందుతున్న రోజులవి. వారితో సంభాషించాడు. 1933 జూన్‌లో సర్దార్ పృధ్వీసింగుతోపాటు బాబాజీ మరల ఇండియాకు బయలుదేరాడు. దారిలో అనేక నదీ నదాలనుదాటి ఎంతో కష్టంతో ఇండియా సరిహద్దుకు చేరుకునేసరికి అరెస్టు చేయబడ్డారు. బ్రిటిషుప్రభుత్వపు కోరిక ప్రకారం యీ యిద్దరినీ కాబూలు

జైలులో పడవేశారు. యిద్దరూ నిరశనవ్రతం పూనారు. ఆఫ్గన్ ప్రభుత్వమూ బ్రిటిషుప్రభుత్వమూ. ఎంత సెన్సారు చేసినప్పటికి యీ వార్త ప్రపంచమంతా పొక్కిపోయింది.

అమెరికాలో, బెర్లిన్‌లో, మాస్కోలో, యిండియాలో కార్మికులు పెద్ద పెద్ద అసమ్మతి ప్రదర్శనాలు జరిపారు. హర్తాలు జేశారు. ఆఖరుకు ఆఫ్ఘన్, బ్రిటిషు ప్రభుత్వాలుకూడా లొంగక తప్పిందికాదు. ఈ యిరువురు విప్లవకారుల్ని విడిచిపెట్టారు. యిద్దరూ సోవియటు రష్యా చేరారు.

కాబూలు జైలు బాధలతో గురుముఖసింగు చిక్కి శల్యావశిష్టుడైనా కొన్ని రోజులు రష్యాలో విశ్రాంతి తీసుకొని మళ్ళా జావా ప్యాసుపోర్టును సృష్టించి పంజాబుకు వచ్చాడు. "లాల్ జండా" అనే కొత్త పత్రిక నొకదాన్ని ప్రకటించాడు గురుముఖసింగు భారత కమ్యూనిస్టుపార్టీ నాయకులతో సంబంధాన్ని యేర్పాటుచు కొన్నాడు. పంజాబులోని విప్లవకారుల వేర్వేరు గ్రూపులను కలుపుటకు ప్రయత్నించాడు.

కాని 1936 లో యీ వృద్ధవిప్లకారుని తిరిగి అరెస్టు గావించి అండమానుకు పంపించారు.

ఈసారి గురుముఖ్‌సింగు అండమాను జైలునే బద్దలుచేశాడు. 1938లో అండమానులో జరిగిన నిరశన వ్రతానికి నాయకత్వం వహించాడు. దానివలన రాజకీయఖైదీలందరు ఇండియాకు తిరిగి తీసుకి రాబడ్డారు. గాంధీజీ మహాకవి ఠాగూరులుకూడా యీ ఖైదీలను విడిపించడానికి శాయశక్తులా కృషిచేస్తామని వాగ్దానం చేశారు.

ఆ వాగ్దత్తం యింతవరకు నెరవేరంలేదు. గురుముఖసింగు తల నెరసిపోయింది. చూపుతగ్గిపోయింది. అయినా గవర్నరు గ్లావ్సి చెప్పుచేతుల్లో నడిచే యూనియనిస్టుప్రభుత్వం మాత్రం ఆయన్ను విడుదల చేయుటకు విరాకరిస్తోంది.

గురుముఖసింగును విడుదలచేయాలనీ, విప్లవకారులను జైలులోబంధించి హింసిస్తున్న యూనియనిస్టు ప్రభుత్వం పోవాలనీ భారతదేశంలో నలుమూలలా ప్రతిధ్వనించునట్లు ప్రజానీకం ఆందోళన చేయాలి.

# కరమ్‌సింగు ఛీమా

ఛీమా పంజాబు రైతు కుటుంబంలో పుట్టాడు. 1907 లో భుక్తికై అమెరికా వెళ్ళాడు. అక్కడ ఒకవైపు తమ నికృష్ట స్థితినీ, రెండోవైపు అమెరికా ప్రజల స్వతంత్రజీవితాన్నీ చూచి పంజాబు రైతుబిడ్డలు గదరుపార్టీని 1913 లో స్థాపించుకున్నారు. అందులో ఛీమాగూడ ఒకడు.

ఇండియాకు తిరిగి రాగానే మూడుసంవత్సరాలకాలం ప్రభుత్వం జైలులో వుంచింది. బయటకు రావడంతోటె ప్రజల్లో పనిచేయ నారంభించాడు. త్వర లోనే రైతుల ప్రియనాయకుడైనాడు.

1920 లో కాంగ్రెసులో చేరాడు. అకాలీ ఉద్యమనాయకుల్లో ఒకడుగా ప్రజాసేవలో ఆరితేరాడు. 1923 లో మళ్ళీ అరెస్టయి 1 సంవత్సరకాలం జైలులో వున్నాడు.

విడుదల కావడంతోటే మళ్ళీ రంగంలో ప్రవేశించాడు. ఒక అకాలీ దళానికి నాయకుడైనాడు "దేశసేవక్" అను వారపత్రికను తీసుకరావడంలో సహాయపడ్డాడు. ఆ పత్రిక ఆ ప్రాంతప్రజల చేతుల్లోని కంచుకాగడా. ప్రభుత్వానికి పక్కలో బల్లెం. అందుకనే ప్రభుత్వం దాన్ని ఊరకనే పోనీయలేదు. సమయం దొరికినప్పుడల్లా సంపాదకుల నరెస్టుచేసి 6 నెలలనుంచి 6 సంవత్సరాలవరకు శిక్ష విధించింది. అయినా ప్రజలు నిరంతరం తమ పత్రికను కాపాడుకోవడంలో వెనుకాడలేదు. నిర్వాహకులు అడగడమే తడవుగా వందలకొలది రూపాయలు విరాళాలువచ్చేవి. వాటికి లెక్కలుగూడ అడిగేవారుకారు. బాబా కరమ్‌సింగ్‌లో ప్రజల కంత విశ్వాసం!

రైతుకూలీ ఉద్యమాల నిర్మాత అయిన భాయి సంతోషసింగుకు 'కీర్తి' పేపరు నడపడంలో కుడిభుజంగా పనిచేశాడు. 1928 లో ఆయన చనిపోయిన తర్వాత దాన్ని కరమ్‌సింగే నిర్వహించాడు.

కీర్తి కిసాన్ పార్టీ సంస్థాపకుల్లో ఒకడు. ఆ పార్టీని ప్రభుత్వం నిషేధించింది. దాంతోబాటు ఛీమానుకూడ నిర్బంధించింది. 1935 లో నిర్బంధకాలం

అంతమయింది. కాని తర్వాత మూడుసంవత్సరాలపాటు ఆయన ఊరిలోనే నిర్బంధించింది. మళ్ళీ 1940 లో అరెస్టుచేసి 1944 దాకావిడిచిపెట్టలేదు. తర్వాతగూడ స్వగ్రామంలో ఇంటర్న్ చేసింది. దాన్ని 1945 సెప్టెంబరుదాకా రద్దు చేయలేదు.

ఈనాడు జలందరు ప్రాంతానికి ఏకైకనాయకుడు భీమా.

# హజారాసింగు

సిక్కుల్లో ప్రభుత్వాన్ని మొదలంట ఊగించిన పార్టీలలో బాబర్ అకాలీ పార్టీ ముఖ్యమైనది. బాబర్ అకాలీ మాటవింటేచాలు పంజాబు యువక హృదయాలు ఉత్సాహోద్రేకాలతో ఉప్పొంగిపోతాయి. అలాంటి బాబర్ అకాలీ ధీరులలో కెల్ల ధీరుడనిపించుకొన్నవాడు మన హజారాసింగు.

బీదతనంవల్ల హజారాసింగు చిన్నతనంలోనే 1914—18 యుద్ధంలో సైనికుడుగా చేరాడు. యుద్ధానంతరం అకాలీలను (బాబర్ అకాలీలను కాదు. బాబరు అకాలీ ఉద్యమం టెర్రరిస్టు ఉద్యమం అ.) ప్రభుత్వం నానా హింసలు పెట్టనారంభించింది. హజారా అహింసాయుతులయిన అకాలీ దేశభక్తులను కాల్చిచంపడం సహించలేక ఉద్యోగం వదలివచ్చేశాడు. అప్పుడు బాబర్ అకాలీలు ప్రభుత్వగులాములను, సి. ఐ. డీ లను దెబ్బకు దెబ్బతో ఆయుధాలతో ఎదుర్కొంటున్నారు. హజారా వారిలో చేరాడు. ఆరోజుల్లో హజారా వీరకృత్యాలు ఇప్పటికి ముసలి రైతులు కథలల్లి చెప్పుకుంటుంటారు.

ఒకసారి బాబర్ అకాలీలు మీటింగు పెట్టుకొంటున్నారు. ఆ ఇంటిని పోలీసులు చుట్టుముట్టారు. తప్పించుకు పోవడం అసాధ్యమైన విషయం. పోలీసులకు ఆ యింటిదగ్గరికి రావడానికి గుండెచాలలేదు; అందువల్ల ప్రక్క ఇండ్లకు నిప్పంటించారు.

ఈ యింటికికూడ నిప్పంటుకుంది. హోరాహోరీగా పోరాటంజరిగింది. పోలీసులకు కొందరికి తీవ్రమైన గాయాలు తగిలాయి. ఇంట్లోఉన్న కొందరు

కాలిపోయినారు. కొందరు తుపాకులకాహుతిఅయినారు. ఆస్థితిలో హజారాసింగ్ నాయకత్వాన కొందరు యువకసింహాలు బయటికి దూకి పోలీసు దళాలనుదూసుకొని తప్పించుకున్నారు. హజారా జీవితంలో అలాంటివి చాలఉన్నాయి.

హజారాను అరెస్టుచేసింది ప్రభుత్వం. ద్వీపాంతరవాస శిక్ష విధించింది. ఘోరాతిఘోరమైన ఒక "బోను" లో హజారాను బంధించింది. జైళ్ళలో సామాన్యంగా దొంగలు, హంతకులకిచ్చే సదుపాయాలుగూడ హజారాకు ఇవ్వలేదు.

ఇరవైనాలుగుగంటలూ పోలీసులు కంట్లో వత్తులు వేసుకొని కాపలా కాచేవారు. అయినా వారికండ్లలో కారంకొట్టి పారిపో ప్రయత్నించాడు. యీ సాహస కృత్యాలను వింటేనే మన శరీరం గగుర్పొడుస్తుంది.

మాంట్‌గొమరీ జైలులోవుండగా తనతోడి 12 గురు ఖైదీలసహాయంతో ఒకనెలరోజులపాటు ఎముకలు విరుగగొట్టుకొని, డెబ్బై ఐదు అడుగుల దూరం ఒక సొరంగంచేశారు. అందులోగుండా తప్పించుకున్నారు. కాని చేతులమీది బేడీలు పగులగొట్టుకోలేక పోయినారు. కొద్దిరోజుల్లోనే పట్టుపడ్డారు.

నిజంగా ఇటువంటి అపజయాలు సంభవిస్తే హృదయాలుపగిలిపోతాయి. కాని హజారాసింగ్ ఏమాత్రం నిరుత్సాహమందలేదు.

ఆయన జైలుజీవితంలో ఒకడజను సార్లకు పైగా నిరాహార దీక్షలు బూనాడు. మొత్తంమీద మూడు సంవత్సరాలకాలం నిరాహార వ్రతంచేసి ఉంటాడు! ఎన్నోసార్లు చెమడాలు వలిచారు. ఎప్పుడైతేనేం, మూడు వందల కొరడాదెబ్బలు తిన్నాడు. పంజాబు జైళ్ళకూ్కడ ఇది చెప్పుకోదగ్గ విషయమే.

ఏడు సంవత్సరాలు ఒంటరి జైలు జీవితం గడిపాడు. 14 సంవత్సరాలు బేడీలలో గడిపాడు.

గుండెమీద చెయ్యివేసుకొని హజారాసింగు లాగ ప్రభుత్వ నిరంకుశ నిర్బంధాలకు గురి అయినవారు మహాకొద్దిమంది ఉంటారని చెప్పవచ్చు.

1938 లో విడుదలై బయటికి వచ్చి మళ్ళీ బాంబువాదాన్ని స్వీకరించ డానికే నిశ్చయించుకున్నాడు. కాని బాబాజ్వాలాసింగ్, సర్జితసింగ్‌లతో చర్చించిన మీదట కమ్యూనిస్టు ఉద్యమంవైపు మొగ్గాడు.

ప్రభుత్వం ఇదికనిపెట్టింది. యుద్ధం ఆరంభంకాగానే అరెస్టుచేసి 1944లో విడుదలచేసింది. డియోలి కాంపులో ఉండగా నిరశనవ్రతంపూనాడు. ఆరోగ్యం పూర్తిగా చెడిపోయినతర్వాతనే విడిచిపెట్టింది ఈ పరాయి ప్రభుత్వం.

ఈకష్టాలే ఇతరులు కనుక అనుభవించవలసి వచ్చినట్లయితే ఎంతమంది ప్రాణాలు వదిలేవారో! చిట్టచివరకు హజారాసింగు అనారోగ్యస్థితిలో కూడా బయటికివచ్చి మళ్ళీ ప్రజాజీవితంలో పాల్గొంటున్నాడు.

# ఫజిల్ ఇల్లాహి కుర్బాన్

గత యుద్ధానంతరం దేశంలో తీవ్రమయిన ప్రభుత్వ వ్యతిరేక సంచలనం బయలు దేరింది. టర్కీని దుంపనాశనం చేసిన ఈ బ్రిటిషుపాలన క్రింద నివశించడమే మహాపాపమని తలచి కొందరు ముస్లింలు అఫ్ఘనిస్థానం వెళ్లారు. వారితో పదిహేడేండ్ల కుర్రవాడుగూడ బయలుదేరాడు. టర్కీ విచ్ఛేదమేకాక, జలియను వాలాబాగ్ దురంతంగూడ అతన్ని కలచివైచింది. ఇక ఇక్కడుండ బుద్ధిపుట్టక అఫ్ఘనిస్థానానికి ప్రయాణమైనాడు. అతడే ఫజిల్ ఇల్లాహి కుర్బాన్.

కాని అఫ్ఘనిస్థానంలో వీరి ఆశలు నిరాశలయినాయి. ఆప్రభుత్వం పట్టీపట్టనట్లు ఊరుకొంది. ఇదిసహించలేక కొందరు మరల తిరిగి వచ్చేశారు. కాని కుర్బాన్, ఫిరోజ్‌దీన్ మన్సూర్, అబ్దుల్‌మజీద్ మొదలయినవారు అడుగు వెనక్కువేయ దలచుకోలేదు. వారు సరాసరి సోవియటు రష్యాకు వెళ్లారు. ఆ రోజుల్లో సోవియట్‌రాజ్యం అంతర్యుద్ధాల్లో మునిగిఉంది.

అక్కడ సోవియట్ల సుస్వాగతాన్ని అందుకున్నారు. ఇంతవరదాకా బానిసత్వంలో చిక్కి శల్యావశిష్టమై పోయిన ముస్లిందేశాలు సోవియట్ పాల

క్రింద ఎంతసుభిక్షంగా అలరారుతున్నాయో చూచి ముగ్ధులైనారు. సహజంగానే సోషలిజం అంటే. సోషలిజం విజయవంతంగా నెలకొల్పబడ్డ సోవియటు రష్యా అంటే ప్రేమ ఏర్పడింది. కుర్బాన్ ఆదేశాల్లో రాజకీయాలు నేర్చుకుంటూ, ఫ్యాక్టరీలలో పనిచేస్తూ, మిలిటరీ తరిఫీదు పొందుతూ 19.5 దాకా ఉన్నాడు.

1927 లో ఇండియా చేరాడు. వెంటనే ప్రభుత్వం అరెస్టు చేసి 5 సంవత్సరాల శిక్ష విధించింది. హైకోర్టులో 3 సంవత్సరాలకు తగ్గించారు. ఈ శిక్షా కాలం పూర్తిఅయిపోయి బయటపడ్డాడో లేదో మళ్ళీ ప్రభుత్వ ఖైదీగా ఉంచబడి 1934 లో విడుదల గావించబడ్డాడు.

మరల ప్రజల మధ్యకు రాగానే ట్రేడుయూనియన్ రంగంలోదిగి గొప్ప చాకచక్యంతో పనిచేయసాగాడు. 1937 ఎన్నికలలో ఎసెంబ్లీకి పోటీచేసి కేవలము 300 ఓట్ల భేదంతో ఓడిపోయినాడు. (ప్రత్యర్థి యూనియనిస్టు) కొద్ది-కాలంలోనే మళ్ళీ ప్రభుత్వం బంధించి 1942 లో విడుదలచేసింది.

మొన్న మద్రాసులో జరిగిన అఖిలభారత ట్రేడుయూనియన్ కాన్ఫరెన్సుకు అధ్యక్షతవహించి మంచి నిర్మాణ చాకచక్యాన్ని ప్రదర్శించి అందరి మన్ననలను పొందాడు. ఇప్పుడు పంజాబు రాష్ట్రీయ ట్రేడుయూనియన్ కాంగ్రెస్ అధ్యక్షుడు.

## జగజిత్ సింగు లాయల్పూరీ

పంజాబులో అబాలగోపాలానికీ అకాలీ ఉద్యమనాయకుడైన తేజసింగ్ సామంద్రి ఆశామూర్తి. ఆయననుంచి ఎంతోమంది చైతన్యాన్ని, ఉత్సాహాన్ని పొంది ప్రజాసేవకులైనారు. జగజిత్‌సింగ్ లాయల్పూరి అలాంటి వారిలో ఒకడు

బి. ఏ. పూర్తిచేసి లాహోరు లా కాలేజిలోచేరాడు. విద్యార్థి ఉద్యమంలో ముఖ్యపాత్రను నిర్వహించాడు. 1938 లో యూనియనిస్టుమంత్రియైన చోటురాంకు వ్యతిరేకంగా బ్రహ్మాండమయిన ఉత్సవాన్ని నడిపాడు.

గతయుద్ధారంభకాలంలో కమ్యూనిస్టుసాహిత్యంతో సంబంధ ఏర్పడ్డది. వెంటనే ప్రజారంగంలోకి ఉరికాడు. బహిరంగంగా చేయకలిగిన కీర్తి పార్టీపని కంతా లాయల్పూరీ బాధ్యతవహించాడు.

1941 లో పంజాబురైతులమధ్య అతని సేవను గుర్తించి అఖిలభారత కిసాన్‌సభకు జాయంటు సెక్రెటరీగా తీసుకొన్నారు. 1942 లో వైస్‌ప్రెసిడెంట యినాడు. తర్వాత ప్రెసిడెంటు అరెస్టుఅయిన తర్వాత అక్టింగ్ ప్రెసిడెంటుగా అఖిలభారత రైతు ఉద్యమాన్ని నడిపాడు ప్రస్తుతం లాయల్పూరీ అఖిలభారత కిసాన్ కౌన్సిల్‌లో సభ్యుడు. రాష్ట్రీయకిసాన్ సభకు కార్యదర్శి.



# చదవండి!

## విశాలాంధ్రలో ప్రజారాజ్యం

ఇంగ్లీషువాళ్ళ పరిపాలనావిధాన ఫలితంగా మన జన్మభూమి ఛిన్నాభిన్నమయిం తెలుగుబిడ్డలు చీలదీసి పాలించబడుతున్నారు. ఆంధ్రవిజ్ఞానము, కళలు, బూజు శిథిలావస్థలో వున్నాయి. తెలుగుదేశానికి పట్టిన ఈ దుస్థితిని తొలగించటానికి విశా దేశంలో ప్రజారాజ్యాన్ని ఏవిధంగా నిర్మించాలో, తద్వారా వ్యవసాయం, పరిశ్రమల విజ్ఞానం కళలు ఎలా అభివృద్ధి చెందుతాయో తెలుసుకోటానికి పుచ్చలపల్లి సుందరయ గారిచే వ్రాయబడిన 'విశాలాంధ్రలో ప్రజారాజ్యం' అనే పుస్తకాన్ని చదవండి.

**114 పేజీలు** వెల 0–8–0

## అందరికీ తిండి

సామ్రాజ్యవాద పరిపాలనావిధాన ఫలితంగా మన వ్యవసాయం నానాటికి తీసికట్టుగ వుంది. అందువల్ల తిండికొరతతో ప్రజలు కరువులపాలవుతున్నారు. బెంగాలులో కరువ వల్ల 35 లక్షలమంది చనిపోయి యింకా రెండేళ్ళన్నా నిండలేదు. మళ్ళీ మనల్ని ఆహా కొరత ఎదుర్కొంది. కరువును దాటటానికి సరియైన పద్ధతులు ఈ చిన్న పుస్తకంల చూడండి. వెల 0–4–0

## అందరికీ ఉద్యోగాలు

యుద్ధం ముగిసింది. కొద్దికాలంలోనే భారతదేశంలో 50 లక్షల మంది నిరుద్యోగ లౌతారు. వీరిలో సైనికులు, కార్మికులు, మధ్యతరగతి ప్రజలున్నారు. వీరినిగురిం ప్రభుత్వం తగినచర్య తీసుకోవడంలేదు. అన్ని రాజకీయపార్టీలు ఈ సమస్యను ఎట్ల ఎదుర్కొని పరిష్కరించుకోవాలో వివరించబడింది. వెల 0–4–0

## కాంగ్రెసు కార్యవర్గానికి కమ్యూనిస్టుల జవాబు (మొదటిభాగం)

ఏ. ఐ. సి. సి. లో వున్న కమ్యూనిస్టు సభ్యులపై సబ్‌కమిటీ యిచ్చినరిపో నాధారంగా చేసుకొని, వర్కింగ్‌కమిటీ పంపిన అభియోగ పత్రానికి పి. సి. జో పంపిన సమాధానం. వెల 0–8–0

ప్రజాశక్తి ప్రచురణాలయం, బెజవాడ

